


పూర్ణచందు సంపాదకత్వంలో భాషా సాంస్కృతిక శాఖ ప్రచురించిన పోలవరం పట్టిసీమ, ఆంధ్రుల ఆకాంక్షలు గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న ముఖ్యమంత్రి గౌ. శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు

# పరిపూర్ణ జీవి



డా॥ జి.వి.పూర్ణచందు



కూర్పు

**గుత్తికొండ సుబ్బారావు**

ప్రచురణ :

**శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్**

24-388, గృహప్రియ ఫుడ్స్, రామానాయుడుపేట, మచిలీపట్నం-521 001

సెల్ : 9440167697, 9440172642

**Paripurna Jeevi Dr. G.V. Purnachand**
*Profile of Dr. G.V.* Purnachand B.A.M.S

Susrutha Ayurvedic Hospital
1st Floor, Satnam Towers,
Opp. Buckinghampet HPO
Governorpet, Vijayawada - 520 002
Cell : 9440 172642

Poems : **Dr. Radha Sree**
Editor : **Sri Guttikonda Subba Rao**

First Edition : 2017

*Title* : A. Giridhar

Published by :
**Smt. Guttikonda Ramaratnam Charitable Trust**
24-388, Gruhapriya Foods,
Ramanaidupeta, Machilipatnam - 521 001
Cell : 94401 67697, 94401 72642

Not for Sale

Printed at :
Sri Sri Printers
Maszid Street, Arundelpet
Vijayawada - 520 002
Cell : 9490634849

# దణ్ణమెట్టాల్సిన వేళ ఇది! దణ్ణాలు!

- డా. జి వి పూర్ణచందు

వివిధ కాలాలలో, వివిధ సందర్భాలలో నా అభ్యున్నతికి కారకులైన సన్మిత్రులు ఎందరో నన్ను ప్రోత్సహించి నడిపించారు. ఉన్నత స్థాయిని అందుకోవటానికి దారులు వేశారు. వారికి నా నమస్కృతులు.

చిన్ననాటినుండీ సాహితీ రంగంలో ఎక్కువ శ్రమించేందుకు ఇష్టంగా నన్ను ప్రోత్సహించిన అమ్మ సత్యప్రసూన, నాన్న చంద్రమౌళీశ్వరరావు గార్లకు నా తొలి నమస్సులు.

నూజివీడులో ఎనిమిదో తరగతి చదివే రోజుల్లోనే నాలో కవిత్వ వాసనలు గుభాళింపచేసిన మహాకవి కీ. శే. దుర్గానంద్, కీ.శే. యమ్వీయల్ నా సాహిత్య జీవితానికి పునాదులు వేసిన ప్రాతఃస్మరణీయులు.

1973 విజయవాడ శాతవాహన కళాశాలలో ఇంటర్ చదువుతున్నప్పుడు సీనియర్ సాత్రికేయులు కీ.శే. జి కృష్ణ, కీ.శే. పురాణపండ రంగనాథ్, కీ.శే. మైత్రేయ వీళ్ళందరితోనూ ఆత్మీయ అనుబంధం ఉండేది. ఆ లేతవయసులో వాళ్ల ప్రభావం నా మీద ఎంతైనా ఉంది.

1975లో నా తొలి రచనలను ప్రచురించి ప్రోత్సహించిన ఆంధ్రప్రభ వారపత్రిక సంపాదకులు కీ.శే. విద్వాన్ విశ్వం గారికి కైమోడ్పులు.

1976-81 వైద్యవిద్యార్థిగా ఉన్నరోజుల్లో ప్రసిద్ధ సాహితీవేత్తలు శ్రీ విహారి, శ్రీ గుత్తికొండ సుబ్బారావు నన్ను సాహిత్యరంగంలోకి చెయ్యి పుచ్చుకు నడిపించారు. అక్కయ్య కీ.శే. తెన్నేటి హేమలత చెవి మెలిపెట్టి మరీ చెయ్యి తిరిగేలా నా చేత అనేక రచనలు చేయించింది. కీ.శే. తుమ్మల వెంకట్రామయ్య, కీ.శే. యేటుకూరి బలరామమూర్తి, కీ.శే. పరకాల పట్టాభిరామారావు, కీ.శే. డా. పరుచూరి రాజారామ్, కీ.శే. ఆవంత్స సోమసుందర్ ప్రభృతులు ఆ రోజుల్లో నాకు దిశానిర్దేశం చేసిన ప్రముఖులు. ఆ వయసులో వీళ్ళ సాహచర్యం దొరికి ఉండకపోతే నా ఎదుగుదల ఇలా ఉండేది కాదేమో!

చిన్నప్పుడెప్పుడో అవనిగడ్డలో కలిసి చదువుకున్న జ్ఞాపకాలేవో ఉన్నప్పటికీ, 1979 బందరులో జరిపిన ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభల సమయంలో పరిచయం

అయిన డా. మండలి బుద్ధప్రసాద్ గారు నాటి నుండీ నేటి దాకా అన్నింటా వెన్నంటి నిలుస్తూ, నా మంచీ చెడులకు ఒక అన్నగా బాధ్యత వహిస్తున్నారు.

క్రమశిక్షణాయుతంగా అంతర్జాతీయ స్థాయిలో సభా నిర్వహణకు నాకు ముఖ్య శిక్షణ లయన్స్ అంతర్జాతీయ సేవా సంస్థలోనే లభించింది. ఉమ్మడి రాష్ట్ర శాసనమండలి పూర్వపు సభ్యులు, లయన్స్ అంతర్జాతీయ డైరెక్టర్ శ్రీ చిగురుపాటి వరప్రసాద్ వ్యక్తిగతంగా నా పైన కలిగించిన ప్రభావం గొప్పది. లయన్స్ పూర్వపు గవర్నర్ లయన్ తటవర్తి దుర్గామల్లేశ్వరరావు నా బాగోగులు చూసిన సన్మిత్రులు.

లయన్ తన్నీరు శేషగిరిరావు అనే పారిశ్రామికవేత్త నేను కోరగానే తన స్థలాన్ని అందులో ఒక భవనాన్నీ ఇచ్చి తన తండ్రి పేరుతో ఒక ఉచిత కంటి ఆసుపత్రి నిర్మాణం చేసి అందించారు. ఆ విధంగా తన్నీరు కృష్ణమూర్తి విద్యాధర లయన్స్ ఐ హాస్పిటల్ కార్యనిర్వాహక అధ్యక్షుడిగా అనేక వేల ఉచిత కంటి ఆపరేషన్లు జరగటానికి కారకుణ్ణి కాగలిగాననే తృప్తి మిగిలింది. ఈ పుణ్యాన్ని కలిగించిన మిత్రులు తన్నీరు శేషగిరిరావు గారికి నా వందనాలు.

తెలుగు భాషోద్యమంలో నా వంతు బాధ్యత నేను నిర్వహించగలగటానికి నలుగురు వ్యక్తులు ప్రధాన ప్రేరకులు. డా. మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, నాటి ద్రావిడ విశ్వవిద్యాలయ ఉపకులపతి ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ, నాటి 'నడుస్తున్న చరిత్ర' పత్రికా సంపాదకులు డా. సామల రమేష్ బాబు. ఈ నలుగురితో మమేకంగా నడిచి భాషాసేవకుడిగా పనిచేయగలిగాను. ఏమిచ్చి వీరి ఋణం తీర్చుకోగలను...? మనస్సులో నమస్సులు ...

నా 'కాంతి స్వప్న' పైన ఎం.ఫిల్ పరిశోధన చేసిన శ్రీమతి వి. శ్రీఉమామహేశ్వరి (ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం), నా సాహిత్యం జీవితంపైన పిహెచ్.డి పరిశోధన (ఆంధ్ర విశ్వవిద్యాలయం) చేసిన డా॥ వేమకోటి శాంతారావు గార్లకు నా అభినందనలు.

డా. రాధశ్రీ గారు నా గురించి విని, తెలుసుకొని నాకు పద్యషష్టిపూర్తి చేశారు...! ఆయనకు నా ధన్యవాదాలు.

ముందే చెప్పాల్సిన విషయం... సమయాన్ని ఇంటి కోసం కాకుండా సాహిత్య కార్యక్రమాలకు, రచనలకూ ఎక్కువగా వెచ్చిస్తున్నా మన్నించిన ఇల్లాలు అరుణ, పిల్లలు లక్ష్మీ చేతన, మనోజ్ఞకార్తీక్ లకు మన్ననలు.

నా బంధువులు నాకు మిత్రుల్లా, నా మిత్రులు ఆత్మబంధువుల్లా నా పురోభివృద్ధికి సహకరించారు. మిత్రుల వల్లే నేను ఎదిగాను. మిత్రులే నా సంపద! అందుకు ఈ పుస్తకమే సాక్షి. అందరికీ నా వందనాలు.

# మిత్రం వందే భిషగ్వరమ్

అసమాన అవధాన సార్వభౌమ
**డా. పాలపర్తి శ్యామలానందప్రసాద్**

ఆత్మీయ మిత్రులు, అభినందనపాత్రులు బహుముఖ ప్రతిభాశాలి, అఘటనఘటనాశీలి, పరిశోధక ప్రవరుడు, భిషగ్వరుడు డా. జి వి పూర్ణచందు గారికి షష్టిపూర్తి ఉత్సవ శుభాకాంక్షలు.

**శపథము పాతంజలమై**
**త్రిపథమ్ముగ చిత్తవాక్యదేహారోగ్య**
**ప్రపయైన పూర్ణచందున**
**కపరిమిత శుభమ్ములగుత మరువది యొకటిన్**

ఆయన షష్టిపూర్తి సమాచారం తెలియగానే నానోట వెలువడిన అభినందన పద్యం ఇది. పూర్ణచందుగారితో నా అనుబంధానికి షుమారు నలభైయేళ్ళు. 1980లో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో ఆయన ఏర్పాటుచేసిన 'మినీకవితాప్రదర్శన' నుండి నేటి వరకు ఆయనను గమనిస్తూనే ఉన్నాను. క్షణం తీరిక, అలసట లేకుండా బహుముఖీనంగా ఆయన చేస్తున్న కృషి అనన్యసామాన్యం. సామాన్య జీవిగా కాకుండా విశిష్ట'జీవీ' గా తనదైన ముద్రతో అవిశ్రాంతంగా సాగిపోతున్న పూర్ణచందు గారిని చూసినప్పుడల్లా

**యోగేనచిత్తస్య పదేనవాచాం మలం శరీరస్య చ వైద్యకేన**
**యోపాకరోత్తం ప్రవరం మునీనాం పతంజలిం ప్రాంజలి రానతో ఒస్మి**

అనే పతంజలిస్తుతి, పతంజలి మహర్షి గుర్తుకొస్తారు. యోగసూత్రాలతో మనోవైకల్యాన్ని పాణినీయభాష్యంతో భాషావైకల్యాన్ని, వైద్యంతో శారీరకవైకల్యాన్ని పోగొట్టటం ద్వారా మానవుల మనోవాక్కాయాలను శుద్ధిచేసి త్రికరణశుద్ధిగా జీవించే ప్రణాళికను అందించిన పతంజలి మహర్షి శైలిలో తన జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న రచయిత, కవి, పండితుడు, చిత్రకారుడు, వైద్యశిరోమణి పూర్ణచందు గారు సార్థక

నామధేయులు. ఏది చేపట్టినా సమగ్రత, సంపూర్ణత సాధించేవరకూ దాన్ని వస్త్రఘాళితం పట్టి పుటం పెట్టి కాచి వడపోసి జీవరసాయనంగా పూర్ణచంద్రోదయంగా చేయటం ఆయన జీవన విధానం.

శ్రీ పూర్ణచందు కార్యదర్శిగా కనిపిస్తున్నా కార్యకర్తగా ఆద్యంతమూ కష్టించటమే ఆయనకు ఇష్టం. జిల్లా సభలు, జాతీయసభలు, ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు ఎలాంటివైనా ఎన్నయినా గంటల్లోనైనా క్రమశిక్షణతో నడిపించగల కార్యదక్షత ఆయన సొత్తు. ఆయన సంపాదకత్వంలో వచ్చిన సంపుటాలన్నీ మహాసంపుటాలు! తెలుగు సాహిత్య చరిత్రలో చిరస్థాయిగా ఆకరగ్రంథాలుగా కలకాలం నిలిచేవిధంగా తీర్చిదిద్దిన సంపాదక నిపుణుడాయన.

డా. పూర్ణచందు గారు ఆయుర్వేద వైద్యవిద్యార్థి కావటంలోనే ప్రగతి కీలకం ఉంది. భారతీయసంస్కృతి, జీవన విధానం, ఓషధులు, ఔషధాలు, లతలు వృక్షాలు, నదులు, సముద్రాలు, కొండలు వీటన్నింటి గురించి ఆసక్తి, అవగాహన ఏర్పడటానికి ఆయుర్వేదాధ్యయనం అనేక విధాలుగా ఉపకరిస్తుంది. తెలుగువారి ఆహారపు అలవాట్లు, శాకపాకాలు, వ్యాధులు, నివారణోపాయాలు వైద్యునిగా తెలుసుకొనేటప్పుడు ఆ విద్యార్థిలో భావుకత, పరిశీలన, పరిశోధనాదృష్టి ఉంటే కవిగా రచయితగా పరిశోధకునిగా అద్భుతం సృష్టించవచ్చు. పైగా సంస్కృతం కూడా పాఠ్యాంశం కావటం బంగారానికి తావి అబ్బినట్టే! శారీరక, మానసిక వ్యక్తిత్వ వికాసానికి, రససృష్టికి శాస్త్రీయ ఆలోచనకు సంస్కృతభాష ఎంతగానో సహాయపడుతూ, మాతృభాషాభిమానాన్ని మరింత పెంచుతుంది.

పాఠశాల స్థాయిలో కళాబీజావాపనం జరిగిన ఆగర్భప్రతిభాశాలి పూర్ణచందుగారికి ఈ విధంగా జరిగిన దిశానిర్దేశం, ఉత్తముల స్నేహం, పెద్దల వాత్సల్యంతో లక్ష్యోన్ముఖమై ప్రణాళికా బద్ధంగా లక్ష్యసిద్ధి జరిగింది. నూరు పుస్తకాలు-వేయిసభలుగా రాష్ట్ర, రాష్ట్రేతర దేశాంతరాలలో తన శాస్త్రీయ ప్రతిపాదనలను అనర్గళ గళ శంఖారావంగా వినిపిస్తున్న గంగరాజువారి అబ్బాయికి షష్టిపూర్తి శుభాకాంక్షలు.

దాదాపు ముప్పై యేళ్ళక్రితం ఆయన రచించిన చారిత్రక నవల 'సప్తసింధు' కోసం ఆయన చేసిన కృషి, పరిశోధనలకు నేను ప్రత్యక్షసాక్షిని. రామాయణం కంటే ముందుకాలంలో భారతదేశం నుండి నైలూ తీరానికి చేరిన సుప్రసిద్ధ రాజవంశంగా పాత్రలు, పేర్లు శాసనాల వంటి ఉపపత్తులతో గొప్ప నవల 'సప్తసింధు' ఆవిర్భవించింది. ఆ వివరాలన్ని ఆ నవలకు వ్రాసిన ముందుమాటల్లో నేను ప్రస్తావించాను.

అలాగే భక్తికీ, శృంగారానికీ సంగీత సాహిత్యాలకు కేంద్రంగా అజరామర కీర్తి నార్జించిన జయదేవుని గీతగోవిందానికి పూర్ణచందుగారు మనోవిశ్లేషణాత్మక వ్యాఖ్యానం వ్రాశారు. ఆనాటి రచనలకు ఈనాటివారు ఎలా అన్వయించుకోవాలో తెలిపే మార్గదర్శిగా ఆ రచనకు ముందుమాటల్లో రచయిత సూక్ష్మ పరిశీలనాదృష్టిని వివరించాను.

'మినీ కవిత' తెలుగులో కొత్తగా ప్రవేశించినప్పుడు దానిని వెలుగులోకి తెచ్చి ఊరారా ప్రచారం చేసిన యువకవి డా. పూర్ణచందు. ఇప్పుడు 'ముక్కాలు' పేరుతో తెలుగుభాషలో సరికొత్త ప్రక్రియా రూపాన్ని సాధికారికంగా, రసాత్మకంగా, సామాజిక సమస్యలను ధ్వన్యాత్మకంగా ప్రవేశపెడుతున్న కవితా సంపుటిని కూడా నేను ప్రథమ శ్రోతగా విని ఆనందించే భాగ్యం కలిగింది. ఇది ప్రయోజనవంతమైన ప్రక్రియ.

పూర్ణచందుగారు, నేను మరికొందరు కవిపండితులు హేవిలంబి నామ సంవత్సరంలో పుట్టినవాళ్ళం. ఈ సంవత్సరాన్ని హేమలంబిగా మార్చిన ఘనతను సాధించాం. మాకంటే ఒక యేడాది ముందు పుట్టిన అన్నగా మమ్మల్ని తీర్చిదిద్ది ప్రోత్సహించి నడిపించిన ఆబాల్యమిత్రుడు డా. మండలి బుద్ధప్రసాద్ గారు. ఆయనకు కృతజ్ఞతలు ఎన్ని చెప్పినా మా ఇద్దరికీ చాలవు.

తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి ప్రాచీనతా గౌరవసాధనకు సాధికారికంగా సాక్ష్యాధారాలతో పోరాడుతూ ఎన్నో విజయాలను నిరాడంబరంగా సాధిస్తూ భావితరాలకు ఆదర్శమూర్తిగా నిత్య కృషీవలుడిగా వెలుగొందుతున్న డా॥ పూర్ణచందు జ్యోతిషశాస్త్రం ప్రకారం నిండు నూట ఇరవై యేళ్ళు ఆయుష్మంతుడై, మరొక షష్టిపూర్తి జరుపుకోవాలనీ, మరెన్నో ప్రామాణికావిష్కరణలతో విజయకేతనం ఇతర భాషల్లో కూడా ఎగురవేయాలనీ, ఆకాంక్షిస్తూ పూర్ణచందు దంపతులకు అభినందనలు తెలియజేస్తున్నాను.

స్వస్తి

సాహిత్యం, పరిశోధన, సేవా రంగాలలో

# "తెలుగు పసిడి" డా॥ జి. వి.

– ప్రసంగ ప్రజ్ఞానిధి డా. గుమ్మా సాంబశివరావు

కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 2006 జాతీయ తెలుగు రచయితల మహాసభల సమయంలో డా. జి వి పూర్ణచందు గారితో నాకు ప్రత్యక్ష పరిచయం ఏర్పడింది. వారితో పాటు నేనూ, మా మిత్రుడు ఆచార్య సిమ్మన్న పాల్పంచుకున్నాం. గుత్తికొండ సుబ్బారావుగారూ, పూర్ణచందుగారూ కలిసి కూచుంటే అద్భుతమైన ప్రణాళికలు సిద్ధమయ్యేవి. ఎప్పుడు సదస్సులు నిర్వహించినా, సభలు జరిపినా, ప్రత్యేక సంచికలు ప్రచురించినా నాకూ అవకాశం కల్పించేవారు. ఒకవైపు ఆయుర్వేద వైద్యవృత్తి, మరోవైపు పుంఖానుపుంఖాలుగా రచనలు, ఇంకోవైపు మహాసభల నిర్వహణ ఇవన్నీ ఏకకాలంలో ఎలా చేయగలుగుతున్నారా అని ఆశ్చర్యం కలిగేది. వారి నిరంతర సాహిత్య కృషిని గమనించినప్పుడు, వారు ఆయా పత్రికల్లో నిర్వహించే ఫీచర్సును పరిశీలించినప్పుడు వారి ప్రతిభాపాటవం అనన్యసామాన్యం అనిపిస్తుంది.

ఏ కార్యక్రమాన్ని నిర్వహించినా చక్కటి ప్రణాళికతో నిండుకుండలా నిశ్చలంగా ఉంటూ, ఆయా సభలలో పాల్గొనే రచయితల ఎంపికలో ప్రత్యేక శ్రద్ధను ప్రకటిస్తూ, సభా కార్యక్రమాల్ని సజావుగా సాగించటం వారికే సొంతం. వారిలోని కలుపుగోలుతనం, ప్రోత్సహించే గుణం, కార్యనిర్వహణ సామర్థ్యం, స్ఫూర్తిదాయకంగా ఉంటాయి.

వ్యక్తిగతంగా నేను విశిష్ట వ్యాసాలను, రచించటానికి, పుస్తకాల్ని ప్రచురించటానికి పూర్ణచందు గారు నాకు ఎంతో ప్రోత్సాహాన్ని కలిగించారు. మనల్ని ఎవరు విమర్శించినా పట్టించుకోకుండా మన పని మనం చేసుకు పోవాలనే సూత్రాన్ని

ఎప్పుడూ చెప్తుంటారు. వారి చాలా రచనలకు నేను ప్రథమ శ్రోతను. ఎవరైనా సలహాలు సూచనలు ఇస్తే అవి సహేతుక మైనప్పుడు సరిదిద్దుకునే సౌజన్యం వారిలో సంపూర్ణంగా ఉంది. ఏ విషయాన్ని గూర్చి చర్చ జరుగుతున్నా దాని పుట్టు పూర్వోత్తరాలు వివరించే పూర్ణచందుగారి జ్ఞాపకశక్తి, విశ్లేషణాత్మక ప్రతిభ, వివరణాత్మక శక్తి ఎంతో ఆసక్తికరంగా ఉంటాయి. ఒకే వ్యక్తికి పలు విషయాల మీద అవగాహన ఉండటం అరుదైన విషయం. అలా బహుముఖీనమైన ప్రతిభ వారిలో మెండు.

కేవలం రచనలోనే కాకుండా వాక్కులోనూ పూర్ణచందు గారిది ప్రత్యేకమైన శైలి. సభలనాడిని బట్టి శ్రోతను తనవైపు తిప్పుకోగల వాక్చాతుర్యం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. తానొక్కడే ఎదగాలనే స్వార్థం కాకుండా పక్కవారిని కూడా వెలిగించాలనే సౌహార్దం నిండుగా ఉన్న సుమనస్వి ఆయన.

నిత్యచైతన్యమూర్తిగా ఉండే పూర్ణచందుగారికి ఆరుపదుల వయసొచ్చిందంటే ఆశ్చర్యం కాకమానదు. అలాంటి సౌజన్యశీలితో వారి వైవిధ్యభరిత కృషిని ముచ్చటించే ప్రయత్నానికి అక్షరరూపమే ఈ ఇష్టగోష్ఠి.

**గుమ్మా: డాక్టరు గారూ! మీరు వృత్తిరీత్యా వైద్యులు కదా! మీకు సాహిత్యం పట్ల అభిలాష ఎలా కలిగింది? దీనికి స్ఫూర్తి ఎవరు?**

**జి.వి.** : 1968-69లలో నూజివీడు ఎస్సారార్ హైస్కూల్లో ఎనిమిదో తరగతి చదూతున్నప్పుడు మహాకవి దుర్గానంద్ గారు మా ఎదురింట్లో ఉండేవారు. వారబ్బాయి అంబికానాథ్ నా సహాధ్యాయి. అప్పట్లో దుర్గానంద్ గారు చిరంతన తెలుగు-ఆంగ్ల కావ్యం వ్రాస్తున్నారు. దగ్గరగా గమనించి కవిత్వం అంటే ఏమిటో ఆకళింపు చేసుకున్నాం ఇద్దరం. ప్రక్కనే చివుకుల సుబ్బావధాన్లు గారింట్లో నిరంతర సాహిత్య చర్చలు సాగేవి. అవీ వింటూ ఉండేవాణ్ణి. అలా సాహిత్యం పట్ల ఆసక్తి కలిగింది. పెరిగింది.

**గుమ్మా: మీ మొదటి రచన ఎప్పుడు ప్రచురితమైంది?**

**జి.వి.** : 1973-75 విజయవాడ శాతవాహన కళాశాలలో ఇంటర్ చదివే రోజుల్లో కాలేజి మేగజైన్'కి స్టూడెంట్ ఎడిటర్'గా ఉన్నాను. అప్పట్లో ఆంధ్రప్రభ వారపత్రికలో "ఆత్మలతో మాట్లాడగలమా?" అనే నా వ్యాసాన్ని, మరికొన్ని రచనలను, చిత్రాలను విద్వాన్ విశ్వం గారు ప్రచురించారు. సోది, పూనకాలు ఇలాంటివి నమ్మరాదని వ్రాశాను.

**గుమ్మా: మీ మొదటి పుస్తకం ఎప్పుడొచ్చింది?**

జివి: అమలిన శృంగారం 1980 మే నెలలో విడుదలైన నా మొదటి పుస్తకం. అప్పటికి సరిగ్గా నాకు 23 యేళ్ళు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాలు సాంఖ్య దర్శనంలో మక్కికి మక్కీగా ఉన్నాయని నిరూపించిన పరిశోధనా గ్రంథం అది. ఆయుర్వేదం చదివేప్పుడు సాంఖ్య, న్యాయ, వైశేషికాది దర్శనాల గురించి కూడా సబ్జెక్టులున్నాయి. వాటిని అర్థం చేసుకోవటానికి ఫ్రాయిణ్ణి, సాంఖ్యదర్శనాన్ని తులనాత్మకంగా చదివాను. ఫ్రాయిడ్ చెప్పిన ఇడ్, ఈగో సూపర్ ఈగో లక్షణాలన్నీ కాశ్యపసంహిత అనే ప్రాచీన గ్రంథంలో తమో, రజో, సత్వ గుణాలకు చెప్పిన లక్షణాలతో సరిపోలటాన్ని గమనించి అమలిన శృంగారం గ్రంథంలో ఒక అధ్యాయంగా వ్రాశాను.

**గుమ్మా: మీకు చిన్ననాడే పెద్దవాళ్లతో పరిచయాలు, స్నేహాలు ఉండేవట...అదెలా సాధ్యం...?**

జి. వి.: వాళ్ళు పెద్దవాళ్ళే! వయసురీత్యా కూడా! మైత్రేయ గారు, పురాణపండ రంగనాథ్ గారు, విహారి గారు, తుమ్మల వెంకట్రామయ్య గారు, పరకాల పట్టాభిరామారావు గారు, పెద్దిభొట్ల సుబ్బరామయ్యగారు, ముక్కామల నాగభూషణం గారు, కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత, గుత్తికొండ సుబ్బారావు వీళ్లతోనే ఎక్కువగా గడిపేవాణ్ణి. నా వయసు వాళ్లతో తిరిగింది తక్కువ. విచిత్రం యేమంటే నా పెళ్ళికి పెద్దలుగా మైత్రేయ, గుత్తికొండ సుబ్బారావు వెళ్ళారు. వాళ్ళు పెళ్ళికొడుకు స్నేహితులంటే పెళ్ళికొడుకు కూడా పెద్ద వయసు వాడై ఉంటాడని వాళ్ళు అనుకున్నారట. అదో ముచ్చట.

**గుమ్మా: తెలుగునాట తొలిగా కవిత్వానికి ప్రదర్శన ఏర్పాటు చేసిన కీర్తి మీదే కదా! మినీ కవితా ఉద్యమ విశేషాలు చెప్తారా?**

జి.వి: మినీకవితా ఉద్యమం ప్రారంభం నాటికి కవిత్వంలో ఒకవిధమైన మొనాటనీ ఏర్పడి ఉంది. కవిత్వం ప్రజలకు చేరువ కావటానికి మినీకవితా రూపం బాగా ఉపయోగపడ్తుం దనిపించింది. 1979-80లలో డా. రావిరంగారావు, నేను మినీకవితా ప్రచారాన్ని ప్రారంభించాం. పిలిచిన చోటుకల్లా వెళ్ళి, కాలేజీల్లోనూ, కార్యాలయాల్లో కూడా మినీకవితా ప్రదర్శనలను ఏర్పాటు చేశాను. 200కు పైగా కవుల మినీకవితల్ని పెద్ద షీట్లమీద వ్రాసి, పక్కనే దానికి తగిన

బొమ్మలు వేసి ప్రదర్శన ఏర్పాటు చేసేవాణ్ణి. ఈ మినీ కవితల సేకరణకోసం నేను చాలా శ్రమించాను. వాటికి నేను వేసిన బొమ్మలకూడా విశేష ఖ్యాతి వచ్చింది. 1981లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి గారు నన్ను ఆహ్వానించి, నా మినీ కవితా ప్రదర్శన ఏర్పాటు చేశారు. నన్ను ఘనంగా సత్కరించారు. ఆచార్య జి యన్ రెడ్డి గారి అధ్యక్షతన జరిగిన ఆ సభలో ఎదురుగా మహామహులు కూర్చుని ఉండగా, మినీకవిత లక్షణాలను స్వరూప స్వభావాలను నేను వివరించి 'ఇంకా మీకేమైనా సందేహాలుంటే అడగండి' అన్నాను. ఇప్పుడది తలచుకుంటే నవ్వొస్తుంది. యౌవనం ప్రభావం, అలా మాట్లాడించిందని!

**గుమ్మా: సాహిత్య సంస్థలతో మీకు అనుబంధం ఎలా ఏర్పడింది?**

**జి.వి:** చిన్నప్పటి నుండీ సాహితీ సంస్థలతోనే నా పరిచయాలు సాగాయి. అనేక సంస్థలకు వెళ్ళి వాళ్ళ సభ్యుణ్ణే అన్నట్టు పనిచేసిపెట్టే వాణ్ణి. విజయవాడలో అరసం, సాంస్కృతిక సమాఖ్య, సమైక్య రచయితల సంఘం, చైతన్యభారతి సంస్థలు ప్రధానంగా ఉండేవి. శ్రీయుతులు కాయితాల రాజేశ్వరరావు, గుమ్మడి దినకరరావు, రమణశ్రీ, శిరీష్ కుమార్, పూర్ణచందు ఆ రోజుల్లో బెజవాడలో ముఖ్య సాహిత్య కార్యకర్తలు. మైత్రేయ గారు అధ్యక్షుడిగా నేను కార్యదర్శిగా విజయవాడ అరసం కార్యక్రమాలు చాన్నాళ్లు నిర్వహించాం. 1980లలో శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల గారితో కలిసి విజయసాహితి సంస్థ ద్వారా లెక్కలేనన్ని కార్యక్రమాలు చేశాం. మినీ కవితా ప్రదర్శనలు ఊరూరా ఏర్పాటు చేయటానికి విజయసాహితి ఒక వేదిక అయ్యింది.

**గుమ్మా: కృష్ణాజిల్లా రచయితలసంఘం పుట్టు పూర్వోత్తరాలేమిటి?**

**జి.వి. :** 1983లో కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభలు అవనిగడ్డ గాంధీక్షేత్రంలో గౌ. మండలి వెంకట కృష్ణారావుగారి ఆధ్వర్యంలో నిర్వహించాం. ఆ సభల్లో కృష్ణాజిల్లా రచయితలసంఘం ఏర్పాటుకు నిర్ణయం తీసుకున్నాం. మండలి వెంకట కృష్ణారావు గారు గౌరవాధ్యక్షులు. ముక్కామల నాగభూషణం గారు అధ్యక్షులు. సుబ్బారావు ప్రధాన కార్యదర్శి. నేనూ బుద్ధప్రసాద్ గారూ కార్యదర్శులుగా ఉన్నాం. ఇంకా లత, డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు ఉపాధ్యక్షులుగా మైత్రేయ కోశాధికారిగా ఉండేవారు. చాలా సభలు, సదస్సులతో

పాటూ నాలుగు మహాసభలు నిర్వహించాం. ఆ తరువాత సంస్థ పెద్దలంతా వరుసగా పరమ పదించడంతో కార్యకలాపాలు కుంటుపడ్డాయి. 2004లో బుద్ధప్రసాద్ గారి పూనికతో సంస్థను పునరుద్ధరించాం. ఆయన గౌరవాధ్యక్షులుగా, శ్రీ సుబ్బారావు అధ్యక్షులుగా, నేను ప్రధానకార్యదర్శిగా, శ్రీ తాతా రమేష్ బాబు కోశాధికారిగా సంస్థ కొత్త ఊపిరులు పోసుకుంది. ఆనాటి నుండీ అలుపెరుగని రీతిలో భారీ కార్యక్రమాలెన్నో నిర్వహించాం. ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ కార్యనిర్వాహక అధ్యక్షుడిగా మూడు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలతో పాటు అనేక జాతీయ సదస్సులు, తెలుగుభాషా సదస్సులు నిర్వహించాం. తెలుగు భాష ప్రాచీనతను నిరూపించే 15 పరిశోధక ఉద్గ్రంథాలను ప్రచురించాం. చెన్నై హైకోర్టులో అడ్డంకిగా ఉన్న కేసును కొట్టివేసి, తెలుగు భాషకు క్లాసికల్ హోదాను ఇప్పించవలసిందిగా సుప్రీంకోర్టుకు వెళ్ళాం. డజనుకు పైగా జాతీయ సదస్సులు నిర్వహించాం.

**గుమ్మా: మీ 26వ యేటనే ఆం.ప్ర. సాహిత్య అకాడెమీకి సభ్యులుగా ఎన్నికయ్యారు కదా! దాని నేపథ్యం వివరిస్తారా?**

**జి.వి:** ఆ రోజుల్లో అదొక సంచలనం. 1984లో అప్పటి సాహిత్య అకాడెమీని రద్దు చేయటానికి రామారావుగారి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్న తరువాతే, అకాడెమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు అకాడెమీ జెనరల్ బాడీకి ఎన్నికలు నిర్వహించారు. ఆంధ్ర మరియు నాగార్జున విశ్వవిద్యాలయాల నియోజకవర్గ సాహితీ సంస్థల ప్రతినిధులుగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు, నేనూ, ఎం. ఎ. మూర్తి, డా. యన్ వి యస్ రామారావు, శ్రీ గణపతిరాజు అచ్యుతరామారాజు ఎన్నికైనాం. కానీ, రామానుజరావుగారు జెనరల్‌బాడీని సమావేశపరచలేదు. వారి మీద వత్తిడి కోసం చేసిన పోరాటాలు, తరువాత చెన్నారెడ్డి ప్రభుత్వానికి వెయ్యిమంది రచయితల సంతకాలతో విజ్ఞాపనలు ఇలా అకాడెమీల పునరుద్ధరణ కోసం చాలా శ్రమించాము.

**గుమ్మా: ప్రస్తుత పరిస్థితుల్లో అకాడెమీలు ఏ విధంగా ఉపయోగపడతాయి?**

**జివి:** అకాడెమీలంటే సాహిత్య సాంస్కృతిక రంగాలను పోషించి, ప్రోత్సహించే సంస్థలే గానీ, అవి ప్రభుత్వ శాఖలు కావు. కొన్ని రాష్ట్రాల్లో సాహిత్య అకాడెమీల పనితీరును బుద్ధప్రసాద్ గారితో వెళ్ళి పరిశీలించే అవకాశం కలిగింది.

అకాడెమీలు లేనందువల్ల తెలుగు భాషా సాహిత్యాలకు ఎంత నష్టం జరిగిందో గమనించగలిగాను. 30యేళ్ళ నష్టం పూడ్చగలిగేది కాదు. జాతీయ స్థాయిలో మనం ప్రాతినిధ్యాన్ని కోల్పోయాం. నార్లవారు ఎత్తి చూపించిన తప్పిదాలకు అనేకరెట్లు తప్పిదాలు అకాడెమీ రద్దు తరువాత జరిగాయి. అది వ్యక్తుల లోపమే కానీ, వ్యవస్థ లోపం కాదు. ఈ కొత్త రాష్ట్రంలో తెలుగు భాషా సంస్కృతుల అభివృద్ధి కమిటీ వారు ప్రాధికార సంస్థ ఏర్పాటును, వివిధ అకాడెమీల ఏర్పాటునూ సూచించారు. అకాడెమీలు వస్తాయని, సమర్థంగా పనిచేస్తాయని ఆశ ఉంది.

**గుమ్మా : వివిధ పత్రికల్లో 33 ఫీచర్స్ వ్రాశారుకదా! ఫీచర్స్ రచనలో మీదొక ప్రత్యేక శైలి అంటారు. అదెలా సమకూరింది?**

**జి.వి :** రచన ఒక తపన! తపస్సు కూడా! సమాజ హితం కోసం రచనా తపస్సు చేసే ప్రతి రచయితా ఋషే! ఏ రచనకైనా ఒక ప్రణాళికాబద్ధమైన సంవిధానం ఉండాలి. తొలి రోజుల్లో మానసిక సమస్యలమీద ఫీచర్లు వ్రాసే అవకాశం ఎక్కువ వచ్చింది. సౌజన్య వారపత్రికలో 1979-80లలో 'ప్రేమ-పెళ్ళి-శృంగారం', 1984-85లలో మయూరి వారపత్రికలో 'మనసా! కవ్వించకే', ఆదివారం వారపత్రికలో 'ఏమిటా రహస్యం?', 1988-89లలో ఆంధ్రపత్రిక దినపత్రికలో 'ఊహల ఉయ్యాల', 1987లో ఆంధ్రభూమి దినపత్రికలో 'పసిమనసు', 1999-2000లలో 'కలిసిన వేళ',-ఇలా మానసిక శాస్త్రపరమైన శీర్షికలు ఎక్కువగా నాచేత వ్రాయించారు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో రోజుకో కవిత వ్రాసే అవకాశం వచ్చింది. చినుకు మాసపత్రికలో 'చరిత్ర నేర్పుతున్న పాఠాలు' శీర్షికలో నేను గృహహింస చారిత్రక నేపథ్యాన్ని ఎక్కువగా వివరించే ప్రయత్నం చేసాను. విశాలాంధ్రలో ముత్యాలప్రసాద్ గారు నాచేత అనేక వ్యాసాలు వ్రాయించారు. అందులో నేను వ్రాసిన చారిత్రక వ్యాసాలన్ని బ్రిటీష్ యుగం పేరుతో పుస్తకంగా వచ్చాయి. అలాగే పద్యానుభవం పేరుతో గత మూడేళ్ళుగా విశాలాంధ్ర ఆదివారం సంచికలో వ్రాస్తున్న శీర్షిక విశేషంగా మేథావుల ఆదరణ పొందింది. ఆంధ్రభూమి వారపత్రికలో "ఆహారోపనిషత్తు", ఆంధ్రభూమి దినపత్రికలో "సంసారవేదం", "మీకు మీరే డాక్టర్" శీర్షికలు నాకు ఎక్కువ ప్రాచుర్యం తెచ్చాయి. ఎమ్ వీ ఆర్ శాస్త్రిగారు, ఎ. ఎస్ లక్ష్మిగారికి, శ్రీ

మంగళగిరి ఆదిత్యప్రసాద్ గారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు.

2008-09లలో విజయవాడ అకాశవాణి వారు నాచేత 50 వారాలపాటు చెప్పించిన "భోజనం కథలు" మంచిపేరు తెచ్చిపెట్టాయి. తెలుగు వెలుగు పత్రిక వారు చాలా వ్యాసాలు నాతో వ్రాయించారు. ఆంధ్రప్రదేశ్ మాసపత్రికలో నా వ్యాసాలన్నీ మేథావి వర్గాన్ని బాగా చేరాయి. నన్ను ఎక్కువగా పాఠకులకు దగ్గర చేర్చింది "వండర్‌వరల్డ్" వట్లూరు నారాయణరావు గారే! సప్తగిరి, కనకదుర్గప్రభ, అరచేతిలో ఆయుర్వేదం, మన ఆరోగ్యం ఇలా అనేక పత్రికల్లో క్రమం తప్పకుండా నేను కనిపిస్తూ ఉంటాను. చాలాపత్రికలకు నేను సలహాదారుణ్ణి.

**గుమ్మా: ఆయుర్వేద వైద్యుల నాయకుడిగా మీ పాత్ర...?**

**జి వి:** నా చదువు, వృత్తి ఆయుర్వేదం. ప్రవృత్తి సాహిత్యం. నేను మెడిసిన్లో చేరక మునుపే అచ్చులో కనిపించిన రచయితని! ఆయుర్వేదం నన్ను బాగా ప్రభావితం చేసింది. జనసామాన్యంలో ఆరోగ్యస్పృహ కోసం 40కి పైగా గ్రంథాలు వ్రాసాను. ప్రజలకు చేరువ కాగలిగాను. తెలుగులో తొలి ఆహార చరిత్ర గ్రంథ రచయితగా ప్రసిద్ధి పొందాను. ఆయుర్వేద వైద్యుల సంక్షేమం కోసం నేషనల్ మెడికల్ అసోసియేషన్ వ్యవస్థాపనలో ప్రముఖపాత్ర వహించాను. దాని విధివిధానాలు రూపొందించి దిశానిర్దేశం చేయగలిగాను. ప్రస్తుతం ఆ సంస్థ రాష్ట్ర అధ్యక్షుడిగా ఉన్నాను. దినదిన గండంగా నడుస్తున్న విజయవాడ ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలను బ్రతికించుకోవటం కోసం, ఆయుర్వేదానికి తగిన ప్రభుత్వాదరణ కోసం కృషి చేస్తున్నాను.

**గుమ్మా: అంతర్జాతీయ సేవా సంస్థ లయన్స్ క్లబ్బులో మీరు సేవలందిస్తున్నారు కదా...?**

**జి. వి:** తాను పుట్టి పెరిగిన సమాజానికి ఏదో ఒకటి చేయాలనే తపన మనిషిని ఊరికే ఉండనివ్వదు. ఈ ప్రవృత్తే నన్ను లయనిజంలోకి లాక్కు వెళ్ళింది. 1985-86 సంవత్సరంలో లయనిజంలో చేరాను. అనేక బాధ్యతలూ, పదవుల్లో పనిచేశాను. లయనిజంలో చేరాక నాలోని కార్యకర్త మెరుగులు దిద్దుకున్నాడు. లయనిజం పైన 9 పుస్తకాలు వ్రాశాను. లయన్ చిగురుపాటి వరప్రసాద్, లయన్ దుర్గామల్లేశ్వరరావు, లయన్ తాతినేని శ్రీహరిరావు గార్లకు నా పుస్తకాలు అంకితం ఇచ్చాను! తన్నీరు శేషగిరిరావు అనే లయన్ మిత్రుడు నా ప్రేరణతో

తన స్థలాన్ని, అందులో ఒక భవనాన్ని లయన్స్ క్లబ్ కోసం నిర్మించి ఇస్తే, అందులో గత 12 యేళ్ళుగా తన్నీరు కృష్ణమూర్తి విద్యాధర లయన్స్ కంటి ఆసుపత్రి ఏర్పాటు చేశాము. దాని వ్యవస్థాపక అధ్యక్షుడిగా అనేక వేల ఉచిత కంటి ఆపరేషన్లు నిర్వహించిన సంతృప్తి నాకుంది.

**గుమ్మా: కృష్ణాజిల్లా సమగ్రచరిత్ర వ్రాసే కమిటీలో మీరూ ఉన్నారు కదా! దాని వివరాలు చెప్తారా?**

**జి.వి:** 2004 కృష్ణాపుష్కరాల తరువాత అప్పటి కృష్ణా కలెక్టర్ శ్రీ కె ప్రభాకరరెడ్డిగారు సీనియర్ పాత్రికేయులు లంక వెంకటరమణ గారినీ నన్నూ పిలిచి తాను ప్రధాన సంపాదకుడిగా మేమిద్దరం సంపాదకులుగా, కృష్ణాజిల్లా సమగ్ర చరిత్ర వ్రాసే బాధ్యత అప్పగించారు. మేము సమాచారం కోసం జిల్లాలో ఏ ప్రభుత్వ కార్యాలయానికి వెళ్ళినా సహకరించాలని ఉత్తర్వులు ఇచ్చారు. మరో ఆరుమందితో కృష్ణాడిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ కమిటీని ఏర్పరిచారు. ఈ కమిటీ ద్వారా కొన్ని పుస్తకాల ప్రచురణతో పాటు, 35,000 పేజీల బ్రిటిష్ రికార్డులను స్కాన్'చేసి ఆర్కయివ్స్ వారికి అప్పగించాం. రమణగారి మరణం, ప్రభుత్వాల మార్పిడిలో ఆ కార్యక్రమం కుంటుపడింది. బిటిష్ రికార్డ్స్ పరిశీలన ఒక జీవితకాలం చాలనంత ఉంది.

**గుమ్మా: తెలుగు భాష ప్రాచీనత విషయంలో మీరెంతో కృషి చేశారు. తెలుగే ప్రాచీనం, నైలూ నుండి కృష్ణదాకా గ్రంథాలు ప్రచురించారు. దీనిమీద మీకు ఆసక్తి ఎలా కలిగింది?**

**జి.వి:** 2004-08 మధ్య తెలుగు భాషోద్యమంలో పనిచేసిన ప్రతి ఒక్కరికీ తెలుగు భాష మూలాలను వెదకాలనే ఆలోచన లుండేవి. అలాంటివి వెదికే విద్యార్హతలున్న వాళ్లలో అత్యధికులు మౌనంగా ఉండటంతో నా బోటి ఫ్రీలాన్సర్లు భాషాభిమానం కొద్దీ కొత్త పరిశోధనలు ప్రారంభించారు. నేను 1990ల్లోనే సప్తసింధు ఐతిహాసిక నవల వ్రాయటం కోసం సుమేరియన్, బాబిలోనియన్ మెడిటరేనియన్ రికార్డుల పరిశీలన బాగా చేయటం, ఆ నవల పూర్తయ్యాక కూడా నా పరిశీలన కొనసాగడంతో నాకు దొరికిన ఆధారాలను బట్టి తెలుగు భాష మూలాలు ఆఫ్రికన్ భాషల్లో ఉన్నాయనే అంశం మీద దృష్టిపెట్టాను. ప్రోటో ఆఫ్రో ఏషియాటిక్ భాషల్లో కొన్ని తెలుగు పదాలు అదే ఉచ్చారణతో, అదే అర్థంలో కనిపించాయి.

ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారి ప్రోత్సాహంతో వాటిని ఏరి 'నైలూ నుండి కృష్ణ దాకా' పుస్తకం వ్రాశాను. ద్రావిడ విశ్వవిద్యాలయం ప్రచురణగా వెలువడింది.

'ఆంధ్ర' అనే మాట ఇండో యూరోపియన్ భాషా కూటమికి చెందిన ఆంథ్రోస్ (మనిషి, ఆంథ్రపాలజీ-మానవసంబంధ శాస్త్రము)లోంచి వచ్చిందనే విషయాన్ని భాషాపండితులకు గుర్తుచేశాను. నా పుస్తకం వెలువడ్డ రెండేళ్ళకు ఫ్రాంక్లిన్ సి సౌత్ వర్త్ పరిశోధనలు నా కళ్ళలో పడ్డాయి. నైలూ నుండి బయలు దేరిన తొలి ద్రావిడ ప్రజలు కృష్ణా గోదావరి ముఖద్వారాల గుండా తెలుగునేల మీద తొలి అడుగు మోపారని ఆయన సూత్రీకరించాడు. ఇక్కడినుండే అటు సింధూ నగరాల్లోకి, ఇటు దక్షిణాది భూభాగాల్లోకి ద్రావిడులు విస్తరించారని సౌత్'వర్త్ మహాశయుడు ప్రతిపాదించాడు. ఇంత మహత్తర పరిశోధనాంశం తెలుగు వారికి తెలియకుండా పోవటానికి మన అలసత్వమే కారణం.

'తెల్' ధాతువుకు to tell తెలియజేయు అని అర్థం. దేశంలో తొలి ద్రావిడ భాషగా పండితులు భావించే బ్రాహుయీ కూడా సంస్కృత 'బ్రూ' (తెలియచెప్పు)పదానికి సంబంధించినది కావచ్చు. సింధు నాగరికతా కాలంలో తొలి తెలుగు (ప్రోటో తెలుగు?) ప్రజలు బోధకులుగానో, శాస్త్రవేత్తలుగానో రాణించి ఉండాలి. ఋగ్వేదంలో దాదాపు 300 వైదిక పదాలు ఇండో యూరోపియన్ భాషాకూటమికి చెందినవి కావని, ముండా లేదా ద్రావిడ పదాలు కావచ్చని ఎఫ్. బి. జె క్వీపర్ వ్రాశాడు. ఋగ్వేద కాలానికి ద్రావిడుల ఉనికి ఉందనేది స్పష్టం. వారి భాష తెలుగు భాషకు దగ్గరగా ఉందనేదీ స్పష్టం! ద్రావిడ విశ్వ విద్యాలయంతో కలిసి, సింధు-కృష్ణా లోయల నాగరికతల అధ్యయన సదస్సు కీలక ప్రసంగంలో ఇవన్నీ ప్రస్తావించాను.

ప్రాచీన తెలుగు ప్రజలు శాస్త్రీయ దృష్టి (మెటీరియలిష్టిక్) కలిగిన వారు. ప్రత్యక్ష ప్రమాణాన్ని నమ్మేవారు. మా మాష్టారు ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు విద్యుత్తు లాంటి అమూర్తిమంతాలైన పదాలకు ద్రావిడ భాషల్లో పేర్లుండవని అనేవారు. నా పరిశీలనకు అదే ప్రేరణ.

తెలుగు నేలమీద ఆఫ్రికన్ 'బెజ' దేవతను ఆరాధించిన ఆఫ్రికన్ ప్రజల కారణంగా బెజవాడ ఊరిపేరు, బెజ్జమహాదేవి లాంటి వ్యక్తినామాలు ఏర్పడి

ఉండవచ్చు. బౌద్ధ జాతక కథల్లో కనిపించే అంథకవెణ్ణు ఆంధ్రవిష్ణవే! అంధకవెణ్ణు కథలోనే వసుదేవుడు గాడిద కాళ్ళు పుచ్చుకున్న సంఘటన వుంది. తెలుగు వారికి సంబంధించిన విశేషాలెన్నో వెలుగులోకి రావాలంటే మన పరిశీలన మరింత విస్తృతం కావాలి.

**గుమ్మా: మీ పరిశోధనల మీద వ్యతిరేక వ్యాఖ్యలు ఏమైనా వచ్చాయా?**

**జి వి:** నా కళ్ళలో పడ్డ వాస్తవాలను కొనసాగవలసిన పరిశోధనలకు ముడిసరుకుగానే వ్రాశాను. వాటిని విశ్లేషించే బాధ్యత పరిశోధకులదే! ఇవన్నీ వెదికి తెచ్చేందుకు నువ్వెవరని అన్నవారే గానీ, నేను తెచ్చిన ముడిసరుకుని ఎవరూ ప్రశ్నించలేదు. అంతకన్నా తాజా సమాచారాన్ని తెచ్చిన వారు లేకపోవటాన, నేను లేవనెత్తిన ప్రశ్నలకు సమాధానాలు ఎవరూ వెదక్క పోవటాన తెలుగు భాషకు అపకారం ఎక్కువ జరుగుతుంది. పురావస్తు శాఖలకు చెందిన వ్యక్తులకున్న సౌలభ్యాలు నా బోటి వారికి అందవు. విద్యార్హత కలిగిన పరిశోధకుల్లో అత్యధికులు ఊరక చూచుచుండే విధిని నిర్వహిస్తున్నారు. చైయ్యెత్తి జై కొట్టేందుకు ప్రేరణనిచ్చే చారిత్రక సత్యాల్ని జాతికి అందించటానికి పూనుకోకపోవటం భాషకు అపకారమే.

**గుమ్మా: మీ "తెలుగే ప్రాచీనం" గ్రంథం తెలుగు భాషకు ప్రాచీనతా హోదా రావటానికి ఆకరగ్రంథంగా నిలిచిందంటారు కదా!**

**జి. వి:** నిజానికి ఆ పుస్తకం అచ్చు వేయటానికి ఎ.బి.కె. ప్రసాద్ గారు ఆశించిన ప్రయోజనం అదే! ఇది హిందీలో ఉంటేనే దీని ప్రయోజనం నెరవేరుతుందని ఆచార్య యార్లగడ్డ లక్ష్మీ ప్రసాద్ గారు, డా. వెన్నా వల్లభరావు గారి చేత హిందీలోకి అనువదింపచేసి, ఆంధ్రప్రదేశ్ హిందీ అకాడెమీ ద్వారా ప్రచురించారు. ఆ కాపీలను ఢిల్లీ స్థాయిలో పంపిణీ చేశారు. ప్రాచీనతా హోదా రావటానికి ఈ గ్రంథం ఆకరంగా ఉపయోగపడిందని ఆయనే స్వయంగా ప్రకటించటం నాకెంతో సంతోషం అనిపించింది. ఆ తరువాత ఈ పుస్తకాన్ని "The Antiquity of Telugu" పేరుతో డా.తుర్లపాటి రాజేశ్వరిగారు, మూర్తిగారు అనువదించారు.

**గుమ్మా: "మీరు తెలుగే ప్రాచీనం-కొనసాగవలసిన పరిశోధనలు" అని పుస్తకం వ్రాశారు కదా! ఆ కొనసాగింపు ఏమైనా జరుగుతున్నదా?**

**జి.వి:** ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం నా "తెలుగే ప్రాచీనం" ప్రచురణ తరువాత

ఏడాదికే ద్రావిడ విశ్వవిద్యాలయం నా"నైలూ నుండి కృష్ణదాకా" పుస్తకం ప్రచురించింది. 2008 జనవరిలో ఆంధ్రప్రదేశ్ ఆర్కయివ్స్ వారి ఇతిహాస్ జర్నల్ వారు "Telugu, the pioneer of Dravidian Family :: Latest observations of Afro Asiatic Languages" పేరుతో నా వ్యాసాన్ని ప్రచురించి నా ప్రతిపాదనలకొక సాధికారికత కలిగించారు. 2013 జనవరిలో ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ వారు "కృష్ణాతీరం మరో చూపు" పేరుతో నా అధ్యక్షోపన్యాసాన్ని ఒక లఘుగ్రంథంగా వెలువరించారు. 2014లో ఆంధ్రప్రదేశ్ టూరిజం వారు "Map My India-Andhra Pradesh" ప్రత్యేక గ్రంథంలో తెలుగు వారి ఆహార చరిత్ర మూలాలమీద నేను వ్రాసిన cuisine అనే వ్యాసాన్ని ప్రచురించారు. 2016లో 'భక్తి' మాసపత్రికలో "తెలుగు వారి తొలివేల్పులు" అనే నా వ్యాసం బాగా ప్రాచుర్యం పొందింది. నైలూ నుండి వచ్చిన ప్రజలు తెలుగు నేలమీద తొలినాళ్లలో నిర్వహించిన పాత్ర మీద ఒక అవగాహన కలిగించే ప్రయత్నం చేశాను. ఇలా నా ఆలోచనల్ని తెలుగే ప్రాచీనం పుస్తకం నాటినుండీ కొనసాగిస్తూనే ఉన్నాను. విద్యార్హత కలిగిన పరిశోధకులకు ఈ రంగం ఖాళీగా ఉన్నదని చెప్పగలను. కానీ, సమాచార సేకరణకు చాలా కష్టపడాలి. అదే ఇబ్బంది.

**గుమ్మా: 2008లో కృష్ణావిశ్వవిద్యాలయంలో తెలుగుశాఖ కోసం కృ. జి ర.సం పక్షాన మీ పోరాటం వివరాలు చెప్తారా?**

**జి.వి:** కృష్ణానది పేరుతో ఒక విశ్వవిద్యాలయం ఏర్పడాలని, అది బందరులోనే నెలకొనాలని బుద్ధప్రసాద్ గారూ, లక్ష్మీప్రసాద్ గారూ, వారితో కలిసి కృష్ణాజిల్లా రచయితల సంఘం చేసిన విశిష్టమైన కృషి ఫలించింది. భారత దేశంలోనే ఒక జీవనది పేరుతో మొదటిసారిగా కృష్ణావిశ్వవిద్యాలయం ఏర్పడింది. కానీ, అందులో తెలుగు శాఖ లేకుండా విశ్వవిద్యాలయం ప్యాకేజీ పంపారని తెలిసి మేం చాలా బాధపడ్డాం. వెంటనే శ్రీ గుత్తికొండ సుబ్బారావు, నేనూ హైదరాబాదులో నాటి రాష్ట్రమంత్రి శ్రీ బుద్ధప్రసాద్ గారింటికి వెళ్ళి విషయం నివేదించాము. తెలుగు శాఖ లేకుండా కృష్ణావిశ్వవిద్యాలయం ఏర్పడితే రచయితలం నిరసన తెలియ జేయవలసి ఉంటుందని చెప్పాం. నిరసనలు, పోరాటాలూ లేకుండా పని జరిగేలా లేదని ఆయన కూడా అభిప్రాయపడ్డారు.

విశ్వవిద్యాలయ ప్రారంభానికి సరిగ్గా రెండు రోజులముందు నాటి కౌన్సిల్ చైర్మన్ తెలుగుశాఖ ఏర్పాటుకు అంగీకారం తెలిపారు. విద్యార్థుల కొరత వల్లనే కొత్త విశ్వవిద్యాలయాల్లో తెలుగు శాఖకు అనుమతి ఇవ్వలేకపోతున్నామని, 15 మంది విద్యార్థులు చేరితే తెలుగు శాఖ ఏర్పరచటానికి ఎలాంటి అభ్యంతరం లేదని చైర్మన్ అన్నారు. తెలుగు చదువుకోగోరే పేద విద్యార్థులకు వారి ఫీజులు చెల్లించి ప్రోత్సహించాలని యార్లగడ్డ వారు సూచించారు. ఫీజు రీఎంబర్స్‌మెంటు అవకాశం లేని పదిమంది పేద విద్యార్థులకు కృష్ణాజిల్లా రచయితల సంఘం ఫీజులు చెల్లించింది 35 మందికి పైగా విద్యార్థులు చేరారు. అలా చదువుకున్న వారిలో కొందరికి చదువు ముగుస్తూ ఉండగానే ఉద్యోగాలు రావటం మాకు ఆనందం కలిగించింది. ఒక రచయితల సంఘం చేయగలిగిన గొప్ప సాహిత్యసేవ ఇది. అలాగే దాతల సాయంతో 6 అద్దాల ఇనుప బీరువాలను తెలుగుశాఖకు బహూకరించాం. షుమారు 1500 పుస్తకాలను నేను బహూకరించాను. కృష్ణా విశ్వవిద్యాలయం కృష్ణాజిల్లా రచయితల సఘం మానసపుత్రిక. మా గౌరవాధ్యక్షులు బుద్ధప్రసాద్ గారికి కృష్ణా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ ఇవ్వటం సముచితం కాగా, అది భాషోద్యమ విజయానికి గుర్తుగా బుద్ధప్రసాద్ గారు ప్రకటించటం ఆనంద దాయకం.

**గుమ్మా: శతాధిక సదస్సులలో పాల్గొని పత్ర సమర్పణలు చేసి సత్కారాలు పొందారు కదా! ఆ వివరాలు చెబుతారా?**

**జి.వి:** దాదాపు 15 విశ్వవిద్యాలయాల తెలుగు శాఖలు నిర్వహించిన జాతీయ సదస్సులలో కీలకప్రసంగ కర్తగానో, అధ్యక్షుడి గానో, అతిథిగానో, పత్ర సమర్పకుడిగానో పాల్గొనే అవకాశం నాకు కలిగింది. రాష్ట్రంలోని అనేక విశ్వవిద్యాలయాలతో పాటు మద్రాసు విశ్వవిద్యాలయం, మదురై కామరాజు విశ్వవిద్యాలయం, బెంగుళూరు విశ్వవిద్యాలయం, తమిళ విశ్వవిద్యాలయం ఆలిఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం, డిల్లీ లోని ఆయుర్వేద కళాశాల ఇలా... అనేక సంస్థల కార్యక్రమాల్లో పాల్గొని నా అభిప్రాయాలు స్పష్టం చేయగలిగాను. కళాశాల స్థాయిల్లో జరిగిన లెక్కలేనన్ని సదస్సుల్లో వివిధ అంశాలపై ప్రసంగించాను. సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్ వారి దక్షిణాది రాష్ట్రాల సదస్సుకు ఆహ్వానిస్తే ఆయుర్వేద వైద్యవిద్య సిలబస్ రూపకల్పనలో

రావలసిన మార్పుల గురించి పలు సూచనలు చేశాను. నిజమైన సాహిత్య సృష్టి విశ్వవిద్యాలయాలకు వెలుపలే జరుగుతోంది. విద్యారంగానికి చెందిన వ్యక్తులకు పరిమితం చేయకుండా, సాహితీ ప్రతిభకు పట్టంగట్టే విధంగా విశ్వవిద్యాలయాలు సదస్సులను నిర్వహించటానికి మరింత చొరవ చూపించటం మంచిదని బావిస్తాను.

**గుమ్మా: మీరు లండన్లో 2012లో జరిగిన సదస్సులో పాల్గొన్నారు కదా! ఆ విశేషాలు తెలియజేస్తారా?**

జి. వి: 2012లో లండన్ నగరంలో పరిశోధకులకు పవిత్రాలయంగా భావించే బ్రిటిష్ లైబ్రరీ హాలులో తొలి ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభల్లో పాల్గనే అవకాశం కలిగింది. తెలుగువారి ఆహారచరిత్ర–మూలాల అన్వేషణ మీద పత్ర సమర్పణ చేశాను. శాసన మండలి చైర్మన్ శ్రీ చక్రపాణి గారు, శ్రీ బుద్ధప్రసాద్ గారు, శ్రీ ఇలాపురం వెంకయ్య గార్లతో కలిసి బ్రిటిష్ మ్యూజియం చూశాను. గుడివాడ బౌద్ధస్తూపంలో దొరికిన బుద్ధుని అస్థికలున్న మూడు బరిణలు అక్కడ పదిలంగా ఉన్నాయి. అమరావతి పురావస్తు సంపద కోసం ఒక అంతస్తు కేటాయించి పూర్తి ఏసీలో భద్రపరిచారు. బుద్ధప్రసాద్ గారూ నేనూ కలిసి మన దగ్గరలేని బ్రిటిష్ రికార్డులెన్నో అక్కడ బ్రిటిష్ లైబ్రరీలో ఉన్నవి వెదికి చూశాము. తెలుగు భాషా సూర్యుడు బ్రౌన్ సమాధిని సందర్శించి నివాళి అర్పించాము. లండన్ తెలుగు ప్రముఖుడు శ్రీ గూటాల కృషమూర్తి గారి ఇంటికి వెళ్ళి ఆయనతో చాలా సేపు గడిపాము. యుక్తా సంస్థ వారు మేము లండన్ నగరం అంతా చూడటానికి మాకు వాహనాలు ఏర్పాటుచేసి దగ్గరుండి చూపించారు.

**గుమ్మా: సందర్భాలకనుగుణంగా మీరు అనేక ప్రత్యేక రచనలు చేసారు కదా... ఆ వివరాలు...**

జి.వి: కాలక్షేపం కోసం నేను ఒక్క రచనకూడా చేయలేదు. 1980లో సంపూర్ణ సూర్యగ్రహణం వచ్చినప్పుడు "రేపటి గ్రహణం, ప్రపంచభవిష్యత్తు" పుస్తకాన్ని మైత్రేయగారితో కలిసి అచ్చువేశాము. 2003లో "మాటలముచ్చట్లు" అనే పుస్తకం(శ్రీ మధులత పబ్లికేషన్స్) వ్రాశాను. తెలుగు భాష పరిరక్షణకు ఒక ఉద్యమం ఆవశ్యకతను ఆ పుస్తకంలో సూచించాను. 2004లో తెలుగు భాషోద్యమం ప్రారంభమయ్యింది. 2004 కృష్ణాపుష్కరాల సందర్భంగా

ఆకాశవాణి విజయవాడ కేంద్రం శ్రీమతి ముంజులూరి కృష్ణకుమారి గారు 39 వారాలపాటు కృష్ణాతీరంలోని ప్రాచీన గ్రామాల చరిత్రలను నా చేత వరుసగా చెప్పించారు. అందులో అమరావతి గురించి నేను ఇలా వ్రాశాను:

**"అద్భుతాలు జరిగే క్షేత్రాలు కొన్ని వుంటాయి. చరిత్రకు నిలిచిపోయే నిర్మాణాలో, చారిత్రక ఘట్టాలో, చారిత్రక సన్నివేశాలో ఆ క్షేత్రానికి ప్రాముఖ్యతనిస్తూనే వుంటాయి. అమరావతి అలాంటి అద్భుతక్షేత్రాలలో ఒకటి.**

**ఒకసారి మహోన్నత నాగరికతా వైభవం.. ఇంకోసారి శిధిలీభూతమైన అలనాటి వైభోగం... అంతలోనే ఉప్పెనలా అదృష్టపు శకలం... మళ్ళీ శిథిలాలు, అమరావతి.. ఆ విధంగా అలనాటి శైథిల్యపు గోడల మధ్య పంచారామాలలో మొదటి ఆరామంగా, ప్రసిద్ధ శైవ క్షేత్రంగా వెలుగుతోంది... ఈనాటికీ! భవిష్యత్తులో ఇది మళ్ళీ తెలుగువారి రాజధాని నగరం అయినా అచ్చర్యపోనవసరం లేదు... ఆ క్షేత్రానికి అలాంటి మహత్త్వం వుంది కూడా!" అని!**

2006 జనవరిలో అలనాటి పట్టణాలు పేరుతో ఒక పుస్తకంగా శ్రీ మధులత వారు దీన్ని ప్రచురించారు. పుష్కరం తిరక్కముందే నా మాటలు నిజం అయ్యాయి. 2000 మిలీనియం సంవత్సరం తరువాత గ్లోబలిజేషన్ దుష్ప్రభావం మితిమీరి, మన ఆహార వ్యవస్థ ధ్వంసం అవుతుండటంతో వెంటనే స్పందిస్తూ 2003లో భోజనభోగం పుస్తకం వ్రాశాను. అది లగాయితూ ఇప్పటి వరకూ ఆహారం-ఆరోగ్యం అనే అంశానికి సంబంధించి 11 పుస్తకాలు వ్రాశాను. మన ఆహార చరిత్ర అతి ప్రాచీనమైనదని, ఇప్పటి బర్గర్లు, ఫ్రైడ్ రైసు లాంటి అనేక వంటకాలను మనకన్నా ఆరోగ్యవంతంగా వండుకుని మన పూర్వులు తిన్నారనీ నిరూపిస్తూ మన ఆహార చరిత్ర పైన 9 పుస్తకాలు వ్రాశాను. తెలుగులో తొలి ఆహార చరిత్ర గ్రంథంగా నా "తరతరాల తెలుగు రుచులు (ఎమెస్కో ప్రచురణ)", తొలి సమగ్ర ఆహార వైద్యగ్రంథం "ఆహారవేదం (శ్రీ మధులత ప్రచురణ)" అత్యంత ప్రాచుర్యం పొందాయి.

2014 కాలచక్ర సందర్భంగా "కాలచక్ర" (శ్రీ మధులత పబ్లికేషన్స్), బుద్ధదేవునికథ (విక్టరీ పబ్లిషర్స్)" బుద్ధుడికి తెలుగు నేలతో కల అనుబంధాన్ని వివరించే పుస్తకాలు వ్రాశాను. 2012లో జస్టిస్ శ్రీకృష్ణకమిషన్ బెజవాడకు

వచ్చినప్పుడు వారి ముందు మాట్లాడే అవకాశం నాకిచ్చారు. మాండలిక వ్యత్యాసాలను ప్రత్యేక బాషగా భావించరాదని, ఆ సాకుతో రాష్ట్ర ఐక్యతను దెబ్బతీయవద్దనీ నేను నా విజ్ఞాపనపత్రంలో పేర్కొన్నాను. కమిటీ నివేదిక ఇంటర్నెట్లో పెట్టగానే "జస్టిస్ శ్రీ కృష్ణ కమిటీ ఏం చెప్పింది? ఎందుకు చెప్పింది" అని పుస్తకం వ్రాశాను నివేదిక వచ్చిన 5వ రోజున నా పుస్తకాన్ని విక్టరీ పబ్లిషర్ ఇమ్మడిశెట్టి రామకుమార్ ఆగమేగాలమీద ప్రచురించి విడుదలచేశారు.

మాండలిక పదాలమీద కృష్ణావిశ్వవిద్యాలయంతో కలిసి ఒక సదస్సును కూడా నిర్వహించాము. వైదికుల పరిభాష మీద అనేక నూతన చేర్పులతో నేను పత్రసమర్పణ చేశాను. మాండలికపదాలను ప్రాంతీయ పదాలుగా ముద్రవేయటం వలన ఆ ప్రాంతానికీ, ఆ పదానికి గానీ ఎలాంటి అదనపు గౌరవం దక్కటంలేదనీ, మాండలిక పదాలన్నీ ప్రధాన నిఘంటువులోకి మాండలికాలుగా చేరిస్తే వాటికి జాతీయత కలుగుతుందని నేను వాదించాను.

2015లో ఆంధ్రప్రదేశ్ శాసన సభాపతి డా. కోడెల శివప్రసాద్, ఉపసభాపతి డా. బుద్ధప్రసాద్ ఇద్దరూ "శాసనసభల్లో నైతిక విలువలు" అనే అంశం మీద రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో సదస్సులు ఏర్పరిచారు. విజయవాడలో సదస్సు సందర్భంగా "భారతీయ సభామర్యాదలు" పుస్తకం వ్రాసి ప్రచురించాను. ఈ నాడు ప్రపంచం అంతా అనుసరిస్తున్న Parliamentary Procedureని తొలిసారిగా చెప్పిన వాడు బుద్ధుడని, ఆయన బౌద్ధసంఘాల నిర్వహణలో అనుసరించిన విధానాలే ఈ నాటికీ మనం పాటిస్తున్నామనీ సవివరంగా ఆపుస్తకంలో వివరించాను.

ఇలా సందర్భాలకు తగ్గట్టుగా అనేక పుస్తకాలు వ్రాశాను. అవి ఆ సందర్భాన్ని చిరస్మరణీయం చేశాయి. కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన సంపాదకుల్లో ఒకరిగా దాదాపు 15 బృహద్గ్రంథాలు ఆ యా సందర్భాల కోసం వెలువరించినవే!

**గుమ్మా: మీరు అనేక ప్రక్రియలలో గ్రంథాలు వ్రాశారు కదా! మీకు ఏ ప్రక్రియ అంటే ఇష్టం?**

**జి.వి:** రచయితకు ఒక ప్రక్రియ అంటే ప్రత్యేకమైన ఇష్టానిష్టాలుంటాయనుకోను. ఎంచుకునే అంశాన్ని బట్టి ప్రక్రియ ఎంపిక ఉంటుంది. ఏ ప్రక్రియలో చెప్పినా అది పాఠకుడికి సూటిగా చేరాలి. ఒక్క పద్యం తప్ప నేను అన్ని ప్రక్రియల్లో

రచనలు చేశాను

**గుమ్మా: పద్యాన్ని ఎందుకొదిలేశారో అడగవచ్చా?**

**జి.వి:** పద్యంలో మాత్రమే చెప్పవలసిన అంశం అంటూ ఏదీ నాకు బుర్రలోకి రాలేదు. అంతకన్నా శక్తిమంతంగా ఇతర ప్రక్రియల్లో చెప్పగలిగినప్పుడు నాకు పద్యం వ్రాయాల్సిన అవసరం కలగలేదు. అలాగని నేను పద్యాన్ని తక్కువ చేయలేదు. విశాలాంధ్ర ఆదివారం సంచికలో గత నాలుగేళ్ళుగా వరుసగా నేను వ్రాస్తూన్న పద్యానుభవం శీర్షిక- పద్యం పట్ల నా మక్కువకూ, గౌరవానికీ సాక్ష్యం. అందరిలా కాకుండా నేను అలనాటి పద్యాన్ని నేటి సమాజానికి అన్వయిస్తూ చేస్తున్న వ్యాఖ్యానాలు అభ్యుదయవాదుల్లో పద్యం పట్ల మక్కువ పెరగటానికి దోహదపడుతున్నాయి.

**గుమ్మా: జీవిత చరిత్రలుకూడా వ్రాశారు కదా...?**

**జి.వి:** అవును! నలుగురు మహానుభావుల జీవితచరిత్రలు వ్రాశాను. తెన్నేటి సూరి సాహితీమహోదయం పేరుతో నేనూ మైత్రేయగారూ 1984లో ఒక పుస్తకం తెచ్చాం. ప్రసిద్ధ సాహితీవేత్త, నిర్మాణరంగ ప్రముఖుడు, కృష్ణాజిల్లా రచయితల సంఘం తొలి అధ్యక్షుడు శ్రీ ముక్కామల నాగభూషణం గారి జీవితచరిత్రను కూడా మేమిద్దరమే వ్రాశాము. మైత్రేయ గారి మరణం తరువాత స్నేహితునిగా ఆయన లేని లోటును ఒకవిధంగా లంక వెంకటరమణ గారు తీర్చారు. రమణగారు, నేనూ కలిసి కృష్ణాజిల్లా ప్రముఖులు, కృష్ణాజిల్లా గ్రామదేవతల చరిత్రల్ని పుస్తకాలుగా తెచ్చాం. 2008లో రమణగారి మరణంతో మేమిద్దరం కలిసి వేసుకున్న చాలా ప్రణాళికలు ఆగిపోయాయి.

2000 సంవత్సరంలో వేముల కూర్మయ్య గారి జీవిత చరిత్ర వ్రాసే అవకాశం నాకు కలిగింది. కూర్మయ్యగారి శతజయంతి సందర్భంగా ఆయన విగ్రహాన్ని దానితోపాటు నేను దీనజనబాంధవుడు పేరుతో వ్రాసిన కూర్మయ్యగారి జీవిత చరిత్రను లక్ష మంది జనసమూహం ఎదుట ఆనాటి ప్రతిపక్ష నాయకుడు రాజశేఖరరెడ్డి ఆవిష్కరించారు. ఈ రచనకు బోయి భీమన్న గారు నాకు ఎంతో సహకరించారు. ఆయనే ముందుమాటకూడా వ్రాశారు. హైదరాబాదులో వారింటికి వెళ్ళి పుస్తకం చదివి వినిపించి సలహాలు తీసుకున్నాను. 1900 నుండి 1950 వరకూ కృష్ణా, గుంటూరు జిల్లాల కేంద్రంగా సాగిన అనేక

రాజకీయ పరిణామా లను ఈ పుస్తకంలో నేను విశ్లేషించాను. మద్రాస్ అసెంబ్లీలో ప్రకాశంగారి మంత్రివర్గ కాలంలో అసెంబ్లీ రికార్డులు పరిశీలించి కూర్మయ్యగారి ప్రసంగాలు సేకరించాను. ఆధునిక యుగంలో తొలి తెలుగు హరిజన నాయకులలో ముఖ్యుడు, కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో తొలి హరిజన విద్యార్థి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రం ప్రకాశం మంత్రివర్గంలో హరిజన సంక్షేమ శాఖ మంత్రిగా పనిచేసి, దక్షిణ భారత దేశంలో హరిజన హాస్టళ్ల నిర్మాతగా ప్రసిద్ధుడైన వేముల కూర్మయ్య గారి జీవితాన్ని పరిశోధించి అనేక విషయాలను వెలుగులోకి తెచ్చే అదృష్టం నాకు దక్కింది. 2016లో గుత్తికొండ సుబ్బారావుగారితో నాకున్న 40 యేళ్ళ సాహచర్యాన్ని గుర్తుచేసుకుంటూ 'గమనం' పేరుతో ఒక పుస్తకం వెలువరించాను.

**గుమ్మా: మీ సాహితీ సేవా రంగంలో మీరు బాగా తృప్తి చెందిన అంశం ఏమిటి?**

**జి.వి:** సాహిత్య కార్యక్రమాలు, నేషనల్ మెడికల్ అసోసియేషన్ కార్యక్రమాలు, లయన్స్ సేవాకార్యక్రమాల మీద దృష్టిపెట్టి, ఇంటికి సమయాన్ని వెచ్చించలేకపోయినా ఇల్లాలు, పిల్లలు మన్నించటం నాకు ఒక సంతృప్తి. వ్రాసి అచ్చు కాకుండా అట్టేపెట్టుకున్న రచనలేవీ మిగిలి లేకపోవటం మరో సంతృప్తి. "ఇది వ్రాశాను-పరిశీలించండీ" అంటూ పత్రికాఫీసులు, పబ్లిషర్ల చుట్టూ తిరగాల్సిన అవసరం రాకపోవటం పెద్ద సంతృప్తి.

నా తృప్తి కోసం నేను వ్రాసినవీ కొన్ని ఉన్నాయి. కాంతిస్వప్న, ముక్కాలు, గీతగోవిందానికి మానసోల్లాస వ్యాఖ్య, పద్యంలో మనం లాంటి పుస్తకాలు ఈ కోవలోకి వస్తాయి. నా సలహాలు, సూచనల ద్వారా తమ ఆహారపు అలవాట్లలో మార్పులు చేసుకుంటూ ఆహారవిషాలను గుర్తెరిగి తమ ఆరోగ్యాన్ని కాపాడుకుంటూన్న వ్యక్తులు వేలసంఖ్యలో ఉండటం అన్నింటికన్నా నాకు ఎక్కువ సంతృప్తిని కలిగించే అంశం. వందలకొద్దీ ఫోన్లు, ఉత్తరాలతో నిరంతరం పాఠకులతో గడిపే అదృష్టం బహుశా చాలా తక్కువ మందికి దక్కుతుందనుకుంటాను.

**గుమ్మా: మీకు నిరుత్సాహాన్ని కలిగించే అంశాలు...?**

**జి.వి:** భాషావేత్తల్లోనూ, భాషమీద జీవిస్తున్న భాషాపండితుల్లోనూ, తెలుగు భాషీయుల్లోనూ భాషాభిమానం రేకెత్తించటానికి ఉద్యమం తేవాల్సిన పరిస్థితి

కన్నా ఏ భాషకూ ఇంతకన్నా దౌర్భాగ్యం ఉండదనుకుంటాను. తెలుగు భాషోద్యమం అంత ఉద్ధృతంగా నడిచినా, భాషా పండితుల్లో ఆశించిన స్పందన రాకపోవటం నన్ను నిరుత్సాహ పరచిన సంగతి. మీలాంటి (గుమ్మా) భాషావేత్తలు భాషోద్యమంలో ముందుపీటీన నడవటం నిరుత్సాహంలో ఉత్సాహాన్ని నింపిన విషయం.

**గుమ్మా: రచయితలకు మీరిచ్చే సూచనలు?**

**జి.వి:** వందపుస్తకాలు చదివి ఒక పుస్తకం వ్రాయాలని మొదట నాకు చెప్పింది డా. తెన్నేటి హేమలత. చెవి మెలిపెట్టి చెయ్యి తిరిగేలా నా చేత రచనలు చేయించిందామె. అధ్యయనం తక్కువ, ఆత్రం ఎక్కువ వలన రచనలో నాణ్యత లోపిస్తుంది. అమీబా నుండీ ఆర్మ్ స్ట్రాంగ్ దాకా ఏ విషయం మీదైనా సరే ఒక పేరా వ్రాయగలిగే ప్రాథమిక పరిజ్ఞానం ఉంటేనే రచయితగా రాణిస్తాడని శ్రీ పురాణపండ రంగనాథ్ ఎప్పుడూ నాతో అనేవారు. నాకు అదే ఆదర్శం. ఎవరికైనా నేనూ ఇదే చెప్తాను. విభిన్న అంశాలమీద నేను వ్యాసాలు, పుస్తకాలు వ్రాయటానికీ, వైవిధ్యం ప్రదర్శించటానికీ ఈ సూక్తిని పాటించటమే కారణం.

**గుమ్మా: మీ ప్రచురణకర్తల గురించి చెప్తారా?**

**జి.వి:** తెలుగునాట ప్రసిద్ధ దిన, వార, మాసపత్రికలు నా రచనల్ని ఎప్పుడో ఒకప్పుడు ప్రచురించినవే! నేను వైద్యం చదువుకునే తొలిరోజుల్లోనే 1978-79సౌజన్య వారపత్రిక నాకు ఫీచర్ ఇచ్చి వ్యాసాలు వ్రాయించింది. నిజానికి నా వయసుకు, స్థాయికి మించిన వ్యాసాలు అందులో వ్రాయగలగటానికి నా అధ్యయనశీలతే కారణం. శ్రీ మహలక్ష్మీ బుక్ ఎంటర్ ప్రైజెస్ వారు 1980లో నా తొలి గ్రంథం అమలిన శృంగారం, 1988లో "తల్లివైద్యం" ప్రచురించారు. శ్రీ మధులత పబ్లికేషన్స్ వారు నావి 45 పుస్తకాల వరకూ ప్రచురించారు. ఎమెస్కో, విక్టరీ, తెలుగు విశ్వవిద్యాలయం, ద్రావిడ విశ్వవిద్యాలయం, స్పందన సాహితీ సమాఖ్యలు నా పుస్తకాలు ప్రచురించాయి. నా ప్రచురణ కర్తలతో నాది స్నేహబంధం.

ఏ రచయితైనా పబ్లిషరు బాగుండాలనే కోరుకుంటాడు. ప్రభుత్వం గనుక పుస్తక ప్రచురణ రంగాన్ని జాతీయోద్యమంలో భాగంగా భావించి అభివృద్ధి చేస్తే, తెలుగులో కూడా అంతర్జాతీయ స్థాయి రచనలు పుడతాయి.

గ్రంథాలయోద్యమం పునర్నిర్మాణం కావాల్సిన అవసరం ఉంది.

**గుమ్మా:** సాహితీ కార్యకర్తగా, సమర్థంగా కార్యక్రమాల నిర్వహణతో పాటు అనేకమంది రచయితలను ప్రోత్సహించి చేయూత నిచ్చారు. 3 పర్యాయాలు ప్రపంచతెలుగు రచయితల మహాసభలు నిర్వహించారు. జాతీయ సభలు, జాతీయ సదస్సులతో భాషోద్యమ స్ఫూర్తికి కారకులయ్యారు. విజయవాడ పుస్తకమహోత్సవంలో రెండు రాష్ట్రాల్లోంచి 350 మంది సాహితీ వేత్తలతో ముఖాముఖీ కార్యక్రమ నిర్వహణలో ప్రధాన బాధ్యత వహించారు. గతంలో అనేక సాహిత్యపరమైన ప్రభుత్వ కార్యక్రమాలు హైదరాబాదుకే పరిమితంగా ఉండిపోయేవి. మీరు ఆ ధోరణిని బహిరంగం గానే ఖండించారు. నవ్యాంధ్ర ఏర్పడిన తరువాత ఒక సమన్వయకర్తగా మీకు అవకాశం లభించినప్పుడు 13 జిల్లాల నుండీ దాదాపు 200 మంది పద్యకవులు, వచన కవులకు ప్రభుత్వ సత్కారాలు లభించటానికి కారకులయ్యారు. రచయితలు స్వంతంగా ప్రచురించిన పుస్తకాలను మాత్రమే విక్రయించే ఒక స్టాలును విజయవాడ పుస్తక మహోత్సవంలో ఏర్పరచి రచయితలకు చేయూత నిచ్చారు. సాహితీ సేవాపరుడిగా మీ సేవలు నిరుపమానమైనవి. మీకు నా శుభాకాంక్షలు.

**జి.వి:** సంతోషం. ధన్యవాదాలు

---

**కిమేతదాశ్చర్య మహావిశేషః, శ్రీపూర్ణచంద్రో భువి పూర్ణచంద్రః ।**

**వైద్యే సుపద్యే చ మహామహిమ్నః, హేమ్నశ్చ సామోదయుతో విశేషః ॥**

ఆహా! ఇది ఎంతో ఆశ్చర్యం! ఎంతో విశేషం! ఆ పూర్ణచంద్రుడు ఈ నేలపైన పూర్ణచంద్రుడైనాడు. వైద్యంలోనూ, సాహిత్యంలోనూ గొప్ప ప్రఖ్యాతి పొందాడు. ఇది బంగారానికి తావి అబ్బినట్టుగా వుంది.

*– శ్రీమాన్ పి.టి.జి.వి. రంగాచార్యులు*

# తప్పటడుగుల నుండి షష్టిపూర్తి దాకా...

- జలదంకి ప్రభాకర్
పూర్వసంపాదకులు, నది మాసపత్రిక

ఆయన పేరు వినగానే ప్రజల గుండె తలుపులు తడుతున్న తెలుగు భాషోద్యమం కళ్లకు గడుతుంది. ముప్పయ్యేళ్లనాటి మినీ కవితా ఉద్యమం గుర్తుకొస్తుంది. సాహితీవేత్తలకొక పండుగలా అనితరసాధ్యంగా నిర్వహించిన ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు దృశ్యమానం అవుతాయి. తెలుగుజాతి మూలాలను వెలికితీసి 'తెలుగే ప్రాచీనం' అంటూ ఎలుగెత్తి చాటిన వైనం స్ఫురణకొస్తుంది. లక్షలాది మంది పాఠకులకు మార్గదర్శకంగా నిలిచిన వైద్యరచనలెన్నో ఆయన కలం నుండి జాలువారాయి. నిజం చెప్పాలంటే ఆయనొక కాంతి దర్శి - క్రాంతి దర్శి. ఆయనే కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యదర్శి డా॥ జి.వి.పూర్ణచందు. తెలుగు విశ్వవిద్యాలయం ఆయనకు 'కీర్తి పురస్కారం' ప్రకటించిన సందర్భంగా 'నది' కోరగానే 'తప్పటడుగుల నుండి...' శీర్షిక కోసం తన బాల్యంలోకి తొంగిచూసి వెల్లండించిన మధురస్మృతులు ఆయన మాటల్లోనే...

తెలుగు సాహిత్యం అంటే నాకు ఇష్టం కలగడానికి దివిసీమ ముఖ్యకారణం. ఏడవ తరగతి వరకూ నా చదువంతా చల్లపల్లి, కస్తానుపాలెం, అవనిగడ్డ, ఘంటసాలలో జరిగింది. కాస్త ఊహ తెలిసింది అవనిగడ్డలో 5వ తరగతి చదువుతున్నప్పుడే!

దివి రత్నాలెందరో పుట్టి పెరిగిన దివ్యభూమి అది!

నాన్నగారు వ్యవసాయశాఖలో గుమాస్తాగా ఉండేవారు. నేను పుట్టేనాటికి ఆయన జీతం 60 రూపాయలట. ఆయన మీద ఆధారపడి నలుగురు చెల్లెళ్ళు, ఒక తమ్ముడు. ఆయనకు నేను గాక ఇంకా ఇద్దరు ఆడపిల్లలు.

అవనిగడ్డలో నన్ను సి.బి.యం. అప్పర్ ప్రైమరీ స్కూల్లో చేర్పించారు. కోట ధనరాజుగారని అప్పట్లో తెలుగు మాష్టారు వుండేవారు. ఆయన మంచి సాహితీవేత్త. చాలా పుస్తకాలు రాశారు. చక్కని తెలుగు చెప్పేవారు. ఆ ఊళ్ళో కొండయ్య మాష్టారు మండలి వెంకట కృష్ణారావు గారింటి ముందున్న పెద్దసావిడిలో ట్యూషన్‌లు చెప్పేవారు. కృష్ణారావుగారి పెద్దబ్బాయి శ్రీ మండలి బుద్ధప్రసాద్ నాకన్నా సంవత్సరం పెద్ద. ఆయన హైస్కూలులో చదివేవాడు. ఇద్దరం కొండయ్య మాష్టారి దగ్గర చదువుకున్నాం. అయితే, అప్పట్లో ఆయన, నేనూ ఎలా వుండేవాళ్ళమో మా ఇద్దరికీ గుర్తు లేదు. కాని, 1980లో ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలను బందరులో మేము నిర్వహించినపుడు ఆయనతో సాహచర్యం ఏర్పడింది. ఇద్దరం చిన్ననాటి సంగతులు అప్పుడు నెమరేసుకున్నాం.

మాతామహుడు దావులూరి వెంకటేశ్వరరావు, పితామహుడు పూర్వేశ్వరరావు లిద్దరూ ఆధ్యాపక వృత్తిలోని వారే. మాతామహుడి దగ్గరే ఎక్కువ పెరిగాను. ఆయన హిందూ పేపరు, ఆంధ్రప్రభ ఎడిటోరియల్ పేజీ రోజూ నాతో చదివించేవాడు. ఆదివారం వస్తే ఒక పూటంతా పేపరు చదవడమే పనిగా వుండేది. అలా చాలా విషయాల్ని గ్రహించగలిగాను. దాంతో సాహిత్యాభిమానం ఏర్పడింది.

1965, 66లలో నాన్నగారు బదిలీ అయి ఘంటసాల గ్రామం వచ్చారు. అక్కడ హైస్కూల్‌లో 6,7 తరగతులు చదివాను. ఆ ఊగ్లో గ్రంథాలయానికి వెళ్ళడం బాగా అలవాటయింది. ఆ రోజుల్లో ఘంటసాల వెంకటేశ్వరరావుగారిని ఆ ఊరికి తీసుకొచ్చారు. ఏనుగుమీద ఊరేగించి పెద్ద పెట్టున బాణాసంచా కాల్చారు. సన్మాన సభ తర్వాత ఆయన కచేరి జరిగింది. ఆ స్టేజీకి ఒక పక్కన, దగ్గరగా ఆనుకొని నుంచుని, ఘంటసాల వారు చెవిమీద చెయ్యివేసుకుని తన్మయంగా పాడటాన్ని నిశితంగా చూస్తున్నాను. హార్మోనీ పెట్టెమీద శృతి వాయించే ఆయనకు ఇంతలో అత్యవసరం ఏదో ఏర్పడి, దగ్గర వున్న నన్ను పిలిచి, “పది నిమిషాల్లో వచ్చేస్తా! ఈ పెట్టెని ఇలానే వాయిస్తూ వుండు - మెట్లు మాత్రం నొక్కకు-” అని హెచ్చరించి వెళ్ళాడు. ఆ మర్నాడు ఘంటసాల సంగీత కచ్చేరీకి హార్మోనియం వాయించానని స్కూల్లో ఒకటే అభినందనలు. అది జీవితంలో ఎప్పుడూ నాకు మరపురాని సంఘటన.

ఆ తర్వాత 1967లో నూజివీడు హైస్కూల్లో ఎనిమిదో తరగతిలో చేరాను. నాన్నగారు నూజివీడు బదిలీ అవటం ఆయనకూ నాక్కూడా గొప్ప మలుపే! ఆయన ఆకస్మాత్తుగా మెహెర్ బాబా భక్తులయ్యారు. ఛాందస భావాలన్నీ వదిలేశారు. కులమతాలు లేవని నమ్మారు. పనిమనిషి తోమిన వంటగిన్నెల్ని నీళ్ళు చల్లి లోపల పెట్టుకునే మా అమ్మకూడా నాన్ననే అనుసరించింది. మెహెర్‌బాబా బోధల ప్రచారం కోసం నూజివీడు

దగ్గర తుక్కులూరు అనే ఊరు వెళ్ళి, అక్కడ ఒక హరిజనుడి ఇంట్లో అమ్మా, నాన్న, నేను, చెల్లాయిలూ అందరం భోజనం చేశాం. మా కుటుంబంలో అది పెద్ద సంచలనమే అయింది. అయితే, నాన్నగారంటే భయంతో బంధువులెవరూ పైకి మాట్లాడలేదు.

నూజివీడు కుక్కల గేటును ఆనుకొని చివుకుల సుబ్బావధానులు గారింట్లో అద్దెకుండేవాళ్ళం. ఆయన గొప్ప వ్యాకరణ పండితుడు. ప్రతిరోజూ సాయంకాలంపూట ఆయన చావడి కవి పండితుల హోరాహోరీ చర్చలతో వాడిగా వేడిగా వుండేది. వాళ్ళబ్బాయిలు ఇనశర్మ, రామశర్మలతో పాటు నేనూ మంచినీళ్ళు, ఫలహారాలూ అందిస్తూ వాళ్ళ సంభాషణని శ్రద్ధగా వినేవాణ్ణి. ఎంతో కొంత అర్థం అయ్యేది. సాహిత్యాభిమానం మొలకెత్తడానికి ఇదొక కారణం.

సరిగ్గా మా ఇంటి ఎదురు గుమ్మమే కవి దుర్గానంద్‌గారి ఇల్లు. వారి అంతర్గోళాలు, చిరంతన, భీతాంగన కావ్యాలు ప్రసిద్ధి. రంగపతి నవల రాశారు. వాళ్ళబ్బాయి అంబికానాథ్, నేనూ క్లాసులో పక్కపక్కన కూర్చునేవాళ్ళం. ఇద్దరికి సాహిత్యాభిమానం చేత మనసులు కలిశాయి. అతను బొమ్మలు బాగా వేసేవాడు. అతణ్ణి చూసి నేనూ బొమ్మలు ప్రాక్టీసు చేసేవాణ్ణి. దుర్గానంద్‌గారు ఆ రోజుల్లో 'చిరంతన' కావ్యం రాస్తున్నారు. ఇంగ్లీషు అనువాదం కూడా చేసేవారు. దగ్గరగా కూర్చుని కవిత్వం ఎలా రాయాలో జాగ్రత్తగా పరిశీలించేవాళ్ళం! చిత్తు ప్రతులకు సాపురాసి ఇచ్చేవాళ్ళం.

గోపాలకృష్ణమూర్తిగారని సోషల్ మాష్టారుండేవారు. ఆయన నన్ను "గంగరాజు వెంకట పూర్ణచందూ..." అని పూర్తిపేరుతో ఆత్మీయంగా పిలిచేవారు. 'చంద్' అనకు, చందు అంటేనే తెలుగు పదం అనేవారు. మా సాహిత్యాభిమాన మిత్రబృందాన్ని 'బాల మేధావులు' అని పిలిచేవాడాయన. మా బృందంలో యన్.వెంకటేశ్వరరావు పశువుల వైద్యుడయ్యాడు. హోమియో డాక్టర్‌గారి అబ్బాయి రమేష్ ఫొటోగ్రాఫరయ్యాడు.

ఆ రోజుల్లో 'బాలానంద సంఘం' ఒకటి పెట్టాలని నాకు బలమైన కోరిక. అప్పట్లో ప్రశ్నలు చెప్పే మామ్మగారొకావిడ మా ఇంటికొచ్చింది. చాలామంది సమస్యలకు పరిష్కారాలు చెప్పించుకున్నారు. నన్ను కూడా అడగమన్నారు. 'నా మనసులో అనుకుంటున్నది అవుతుందా...?' అనడిగాను. నేనడిగేది బాలానంద సంఘం గురించి, ఆవిడ దేని గురించి అడుగుతున్నా ననుకుందో తెలియదు. "అవుతుంది" అన్నది. అయితే, మూడువారాలు కూరలు లేకుండా బెల్లంముక్కతో అన్నం తినాలని, నల్లబట్టలు కట్టుకోవాలని చెప్పిందామె. సరే అన్నాను. అన్నం, నెయ్యి, బెల్లంముక్కే, ఆహారం. నాకు 'తీపి' అంటే మొదటినుంచి ఇష్టం వుండేది కాదు. మూడో రోజుకే మొహం మొత్తింది. అయినా బలవంతంగా రెండు వారాలు తిన్నాను. సగంరోజులు దాటాయి

కాబట్టి, మహిమ కొంతయినా వుండకపోతుందా... అనుకున్నాను. ఎం.ఆర్.అప్పారావుగారు అధ్యక్షుడిగా, నేను కార్యదర్శిగా బాలానంద సంఘం పెట్టడం కోసమే ఇంత కష్టాన్ని భరించాను. ఒకరోజు తిన్నగా ఎం.ఆర్.గారి ఎస్టేట్ కెళ్లాను. నా దురదృష్టమో, ఆయన అదృష్టమో ఆయన ఊళ్ళో లేరన్నారు. నేను వెనక్కి వచ్చేశాను. బాలానంద సంఘం కోరిక అలానే అణిగిపోయింది.

బ్రహ్మానందరెడ్డిగారి పాస్‌ల పుణ్యమా... అని 8,9 తరగతులు మళ్ళీ చదవాల్సిన పని లేకుండా పదవ తరగతిలోకి వచ్చేశాం. ఆ రోజుల్లో నూజివీడులో యమ్వీయల్ గారంటే కుర్రకారుకు గొప్ప వ్యామోహం వుండేది. ఆయన బాపూ, రమణలకు సన్నిహితుడనీ, రమణగారికి సంభాషణలు రాయడంలో సహకరించేవాడనీ చెప్పుకొనేవాళ్ళు, బుద్ధిమంతుడు, సంపూర్ణ రామాయణం సినిమాల్లో మంచి సంభాషణలుగా అనిపించినవి యమ్వీయల్ రాసి వుంటారని అనుకునేవాళ్ళం. అప్పటికింకా "ముత్యాల ముగ్గు" తియ్యలేదు.

ధర్మ అప్పారావు కళాశాలలో బి.ఏ.చదువుతున్న రామసూరి ఆ తర్వాత ప్రసిద్ధ కవి అయ్యారు. విజయనగరంలో అధ్యాపకులుగా వున్నారు. యమ్వీయల్‌గారి పర్యవేక్షణలో 'రామసూరి', అతని మిత్రులు, "పాంచజన్య" అనే లిఖిత మాసపత్రికని తయారుచేసి నూజివీడు జిల్లా గ్రంథాలయంలో పెట్టారు. అది చూశాక అంబికానాథ్‌కూ, నాకూ మనసాగలేదు. మనం కూడా అలాంటిది చెయ్యాల్సిందే అనుకున్నాం. బాల మేధావుల బృందం అంతా సరేనన్నారు. 'మేఘమాల' అని పత్రికకి పేరుపెట్టాం. అందులో బొమ్మలూ, చేతిరాత వ్యవహారాలూ అంబికానాథే చూసేవాడు. అతను సంచాలకుడు, నేను సంపాదకుడు - అనుకొన్నాం. "మేఘమాల లిఖిత మాసపత్రిక" తొలి సంచికని తయారు చేసి హైస్కూల్ లైబ్రరీలో పెట్టాం. దుర్గానంద్‌గారు, గోపాలకృష్ణ మాష్టారు బావుందన్నారు.

బాల మేధావులకు ప్రశంసలు బాగానే వచ్చాయిగాని, పదవ తరగతి రెండోసారి రాయకతప్పలేదు మాలో చాలామందికి.

నూజివీడు రామాయమ్మారావుపేటలో ఒక ఇల్లు కట్టుకుని అక్కడ వుంటున్నాం. ఆ సమయంలో జై ఆంధ్ర ఉద్యమం ఉధృతంగా వచ్చింది. మా ఇంటి దగ్గర తుమ్మల నరసింహమూర్తి (టి.యన్.యమ్) అనే లెక్చరర్ - కమ్యూనిస్టు మేధావి వుండేవారు. ఆయన సమైక్యతావాది. ఆయన ప్రభావాన నేను కూడా సమైక్యవాదానికే కట్టుబడివున్నాను.

ఆ ఉద్యమ కాలంలో నాన్నగారికి తిరువూరు బదిలీ అయింది. చదువు ఎటుతిరిగీ లేదు కాబట్టి, తిరువూరులో మేఘమాల రెండవ సంచికని తెచ్చాను. పురాణం

కుమార రాఘవశాస్త్రి, భారతిలో కథలు రాసేవారు. ఆ ఊర్లోనే వుండేవారు. రోజూ ఆయన దగ్గర కూర్చుని ఆయన చెప్పే సాహిత్య సంగతులు వినేవాణ్ణి, మేఘమాలకు 'డి.యల్.ఓ' అని ఒక కథ కూడా రాసిచ్చారు.

ఆ తర్వాత 1973-75లలో విజయవాడ శాతవాహన కళాశాలలో ఇంటర్మీడియట్ చదువు యద్దనపూడి వెంకటేశ్వర రావుగారు ఇంగ్లీషునీ, డా॥జంధ్యాల పరదేశిబాబుగారు తెలుగునీ చెప్పేవారు. 'ఈ ఇద్దరూ మొదటిరోజే నాలో రచయితని గుర్తించారు. క్లాసులో అందర్నీ పరిచయం చేసుకొంటూ, "మీలో ఎవరైనా రాస్తుంటారా?" అనడిగారు. నేను లేచి నుంచున్నాను. ఏం రాస్తావంటే కథలని చెప్పి, రెడీగా నా దగ్గరే వున్న నా కథ తీసి చదివేశాను. అందరిచేతా చప్పట్లు కొట్టించారు పరదేశిబాబుగారు.

అది శివాజీ పట్టాభిషేక త్రిశతాబ్ది ఉత్సవాల సంవత్సరం. కాలేజీ మేగజైన్‌ని ఆ సందర్భంగా తెస్తూ, నన్ను ఎడిటోరియల్ బోర్డులోకి తీసుకున్నారు. కథలు, కవితలు, వ్యాసాలను సరిచేసి, ప్రూఫులు దిద్దేపనిని నాకే అప్పగించారు. అందువలన నాకు చాలా అనుభవం వచ్చింది.

ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరంలో పురాణపండ రంగనాథ్‌గారితో పరిచయం నా సాహిత్య జీవితానికి గట్టి పునాదులు వేసింది. రామ్మోహన గ్రంథాలయం నుంచి పుస్తకాలు తెచ్చుకుని రంగనాథ్ గారి దగ్గర కూర్చుని వాటి గురించి చెప్పించుకునేవాణ్ణి, అప్పట్లో ప్రసిద్ధ పాత్రికేయులు జి.కృష్ణ గారు విజయవాడ సత్యనారాయణపురం, కుక్కలమేడ ఎదురింట్లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్ స్పెషల్ కరస్పాండెంట్‌గా వుండేవారు. ఆయన నన్ను అభిమానంగా చేరదీశారు. చలం గురించి, కృష్ణశాస్త్రి గురించి, జిడ్డు కృష్ణమూర్తి గురించి, విజయవాడలో "ఫ్రీ లవ్ సొసైటీ" గురించి ఎన్నెన్నో విశేషాలు పాతకాలం నాటి సంగతులు చెప్పేవారు. మేఘమాల 3వ సంచికలోకి ఒక కథ కూడా రాసిచ్చారు. ఆ రోజుల్లో ఇలా చాలామంది ప్రముఖులతో పరిచయాలయ్యాయి. చాలా విషయాలు ఆకళింపు చేసుకున్నాను.

ఇంటరయ్యాక ఎం.బి.బి.యస్. ఎంట్రన్స్‌లో గెలవలేకపోవడంతో ఇంక సైన్స్ చదువుకు స్వస్తి చెప్పి, డిగ్రీ పూర్తిచేసి ఏదైనా పత్రికలో చేరిపోవాలని నిర్ణయించుకున్నాను. కానీ, కోనాడ అశోక్ అనే నా మిత్రుడు అప్పుడు విజయవాడ డా॥ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలలో మూడవ సంవత్సరం చదువుతుండేవాడు. ఆ కాలేజీ ఎడ్మిషన్లు పడ్డాయని అప్లికేషన్‌ను తెచ్చి "మీ అబ్బాయిని ఆయుర్వేదంలో చేర్పించండి" అని మా నాన్నగార్ని ఒప్పించి వెళ్ళాడు. డా॥ కోనాడ అశోక్ ప్రసిద్ధ గాయకుడు కూడా! అలా అతని ప్రేరణతో ఆయుర్వేద కళాశాలలో చేరాను. ప్రిన్సిపాల్ ముదిగొండ

శంకరశాస్త్రిగారి అభిమాన శిష్యుడినయ్యాను. సామాన్య ప్రజల కోసం ఆయుర్వేదం గురించి ఆయన చెప్తుంటే నేను నా భాషలో రాసి, చిన్న పుస్తకంగా రూపొందించి ఆయనకు అందించాను. ఆయన చాలా సంతోషించారు. దాని వలన పుస్తకం రాసే అనుభవం నాకు సమకూరింది.

1975,76లలో నేను వేసిన రెండు బొమ్మల్ని ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రచురించి, పది రూపాయలు చొప్పున పారితోషికం పంపారు. మంచి ఉత్సాహం వచ్చింది. "ఆత్మలతో మాట్లాడగలమా?" అని టెలిపతి మీద వ్యాసం రాసి పంపాను. దాన్నీ ప్రచురించి 15 రూపాయలు పంపారు. అది అచ్చయిన నా తొలి రచన.

జయశ్రీ మాసపత్రిక, వారపత్రిక నాలాంటి యువ కవులకు అండగా వుండేవి. శ్రీ చొక్కాపు వెంకటరమణ వాటిని చూసేవారు. దాని సంపాదకులు రామ్మోహనరావుగారు నాచేత కథలు, కవితలు, వ్యాసాలు రాయించి ప్రచురించారు. కొన్ని కథలకు నాతో బొమ్మలు కూడా వేయించేవారు. కార్టూన్లు కూడా గీసేవాణ్ణి. రచయితగా నాకు మంచి గుర్తింపు రాసాగింది.

1976లోనే, వై.జి.కె. ప్రసాద్ (గోపీకృష్ణ), నగ్నమునిగారి సోదరుడు రామ్మోహనరావుగార్లతో నాకు మంచి స్నేహం వుండేది. వైజికె నన్ను బందరులో శ్రీయుతులు విహారి, శాలివాహన, గుత్తికొండ సుబ్బారావు, పువ్వాడ తిక్కన సోమయాజి గార్లకు పరిచయం చేశాడు. నాలో రచయితతోపాటు కార్యకర్త కూడా వున్నాడని గుర్తించింది వీళ్ళే! వెనువెంటనే బందరులో ప్రసిద్ధ సాహితీ సంస్థ స్పందన సాహితీ సమాఖ్య కార్యవర్గంలోకి నన్ను తీసుకున్నారు. సుబ్బారావు ప్రధాన కార్యదర్శి, నేను కార్యదర్శిగా వుండేవాళ్ళం. ఎన్నెన్నో సభలు నిర్వహించారు. 60 పుస్తకాలు ప్రచురించాం. స్పందనవాణి అనే పత్రికని ఏడాదిపాటు అతి వ్యయప్రయాసలకోర్చి తీసుకొచ్చాం. శ్రీ విహారి, శ్రీ సుబ్బారావుగార్ల శిక్షణలో క్రమశిక్షణ కల్గిన కార్యకర్తగా మారగలిగాను. రాష్ట్రంలోని ప్రముఖ కవులెందరితోనో ఆ రోజుల్లో నాకు సాన్నిహిత్యం ఏర్పడింది. మహాకవి దాశరథితో ఒకరోజంతా గడిపే అదృష్టం కలిగింది. జ్ఞానపీఠ పురస్కార గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డిగారితో కలిసి ప్రయాణించే అవకాశం చిక్కింది. వచన కవితా పితామహుడు కుందుర్తికి అభిమాన శిష్యుడినే అయ్యాను.

వైద్య విద్యార్థిగా నాల్గవ సంవత్సరం చదువుతున్నప్పుడు, 1980లో "అమలిన శృంగారం" వ్రాశాను. శ్రీ మహాలక్ష్మివారు దానిని ప్రచురించారు. పి.వి.రమణయ్య రాజా, ఇచ్ఛాపురం జగన్నాధరావు(ఐ.జె.రావు) దానిని ఆవిష్కరించారు. రాంషా గ్రంథ పరిచయం చేసి నన్ను మెచ్చుకున్నారు. సైకాలజీ ఆఫ్ సెక్స్ మీద ఆయుర్వేదాన్ని,

ఫ్రాయిడ్‌నీ సమన్వయ పరుస్తూ రాసిన పరిశోధనా గ్రంథం అది.

1979, 80లలో ప్రసిద్ధ కథా రచయిత్రి శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల అధ్యక్షురాలిగా, నేను కార్యదర్శిగా 'విజయసాహితి' అనే సంస్థను పెట్టి, కనీసం ఒక వంద సాహిత్య కార్యక్రమాలు జరిపి వుంటాం. ఆ రోజుల్లో పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారూ, యమ్వీయల్ కలిసి మినీ కవితలని పేరుపెట్టి చిన్న కవితలను ప్రచురించే వాళ్ళు. ఆంధ్రజ్యోతి దినపత్రికలో కూడా ఆదివారం నాడు వచ్చేవి. ఆ ప్రేరణతో మినీ కవితల్ని చాలా మంది రాయటం మొదలు పెట్టారు. క్రమేణా దానికొక స్వరూపం. లక్షణాలు ఏర్పడసాగాయి. ఆ సమయంలో పాత పత్రికలు, పాత కవితా సంకలనాలూ తిరగేసి అప్పటివరకూ వచ్చిన మినీకవితల్ని 200 దాకా ఏరి, వాటిని అట్టలమీద రాసి, వాటికి తగిన బొమ్మలు వేసి "మినీ కవితా ప్రదర్శన"ని మొదటిసారిగా బెజవాడలో ఏర్పాటు చేశాను. కవిత్వానికి ప్రదర్శన అనే ఈ విధానం ప్రజల్ని ఆకట్టుకుంది. ఊరూరా ఈ ప్రదర్శనలు ఏర్పాటుచేశాను. ఎంతో మంది అప్పటికప్పుడు కలం పట్టి కవులుగా మారేందుకు ఈ ప్రదర్శనలు తోడ్పడ్డాయి. ఒకవైపు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు ఇంకొకవైపు శ్రీ రావి రంగారావు లక్షణ సిద్ధాంతాలు చేస్తుండగా మధ్యలో నేను ప్రచారకునిగా, మినీ కవితల్ని భుజాన వేసుకుని దేశం అంతా తిరిగాను. ఆచార్య జి.యన్.రెడ్డిగారు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతిగా వున్నప్పుడు, 1982లో ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి గారు నన్ను విశ్వవిద్యాలయానికి ఆహ్వానించి, మినీకవితా ప్రదర్శన, నా ఉపన్యాసం ఏర్పాటు చేశారు. 24ఏళ్ళ వయసులో ఒక విశ్వవిద్యాలయంలో పెద్దల ముందు మాట్లాడగలిగే గొప్ప అవకాశం అది!

కవిగా నాకు మంచి పేరు తెచ్చి పెట్టింది. 'కాంతిస్వప్న' దీర్ఘ కవితా కావ్యం. సాంఖ్య సిద్ధాంతానుసారం అవ్యక్తంలోంచి ఈ సృష్టి ఎలా ఏర్పడిందో విశ్లేషిస్తూ ఆ కావ్యాన్ని రాశాను. కవిత్వంలో సంక్షిప్త శబ్దచిత్రాలు వుండాలి. కవితా కావ్యాలు రావాలి అని చెప్పే కుందుర్తి గారి ప్రభావంతో రాసిన కావ్యం ఇది. దాన్ని ఆయనకే చదివి వినిపించాను. విన్నాక శ్రీ కుందుర్తి నాతో ఏమీ చెప్పకుండా నా గురువు శ్రీ గుత్తికొండ సుబ్బారావుకు ఉత్తరం రాశారు. "పూర్ణచందులో ఇంత లోతైన కవి ఉన్నాడనుకోలేదు. అతను తన వయసుకు మించిన కవిత్వం రాశాడు. ఐదేళ్ళు ఆగి, మరొకసారి చదివి అప్పుడు అచ్చు వెయ్యమని చెప్పు." ఇది ఆ ఉత్తరంలోని ఆదేశం!

1982లో నేను వైద్య వృత్తిలోకి రావడం. వెంటనే వివాహం, జీవితంలో స్థిరపడే ప్రయత్నాల వలన నిజంగానే ఐదారేళ్ళవరకూ 'కాంతిస్వప్న'ని అచ్చు వేయించే అవకాశం చిక్కలేదు. 1988లో శ్రీ గుత్తికొండ సుబ్బారావు స్పందన సాహితీ

సమాఖ్యప్రచురణగా దాన్ని వెలువరించారు. అప్పట్లో ఆ కావ్యం నాకు ఎనలేని కీర్తి ప్రతిష్టలు తెచ్చిపెట్టింది.

1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని వ్యవస్థాపించి 10 మహాసభల వరకూ నిర్వహించాం. శ్రీ ముక్కామల నాగభూషణం అధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ మండలి బుద్ధప్రసాద్, నేను కార్యదర్శులుగా, కార్యవర్గం ఏర్పడ్డాం. 1984లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి జరిగిన ఎన్నికలలో పోటీచేసి, సభ్యుడిగా గెలుపొందాను. 27 ఏళ్ళ పిన్నవయసులో అకాడమీ సభ్యుడు కావడం అప్పట్లో ఒక సంచలనం అయింది.

1991లో 'సప్తసింధు' నవల రాశాను. ఈజిప్టులో మన పురాణ ప్రసిద్ధ పాత్రలకు పురావస్తు ఆధారాలు దొరుకుతున్న వైనాన్ని ఈ నవలలో తెలియజేశాను. ఆ విధంగా సగరచక్రవర్తి చరిత్రను నవలగా రూపొందించాను.

అలనాటి పట్టణాలు, బ్రిటిష్ యుగం, బుద్ధదేవుడికథ రామాయణంలో విశేషాలు మొదలైన పుస్తకాలు వ్రాశాను. గీతగోవిందానికి మానసోల్లాస వ్యాఖ్య రాశాను. సభా నిర్వహణలో పార్లమెంటరీ సంప్రదాయాల మీద "సభాపర్వం" అనే పుస్తకం రాశాను. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో తొలి హరిజన విద్యార్థి శ్రీ వేముల కూర్మయ్య జీవితచరిత్రను 2000 సంవత్సరంలో రాశాను. అప్పటి ప్రతిపక్ష నాయకుడు డా॥ వై.యస్. రాజశేఖరరెడ్డి లక్షమంది ప్రజల సమక్షంలో ఆ పుస్తకాన్ని ఆవిష్కరించి సన్మానించారు.

ఆయుర్వేద వైద్య రహస్యాలను సామాన్యుల కోసం రాసిన వైద్య గ్రంథాలు నన్ను పాఠకలోకంలో చిరస్థాయిగా నిలబెట్టాయి. ప్రతిరోజూ 50 నుంచి 60 ఫోన్లు పాఠకులనుంచి ఆరోగ్య సలహాకోసం వస్తుంటాయి. "ఏ రచయితకి ఇంత పాఠక పరిచయ అదృష్టం దక్కిందీ?" అని సంతోషిస్తూ వుంటాను.

తరతరాల తెలుగు రుచులు, భోజనం కథలు, భోజన భోగం, అలనాటి ఆహారాలు, ఆయుర్వేదంలో పథ్యాలు - అపథ్యాలు లాంటి పుస్తకాలు వైద్యరచయితగా, ఆహార చరిత్రకారుడిగా నాకు మంచి గుర్తింపు తెచ్చాయి. "తెలుగువారి తొలి ఆహార చరిత్రకు స్వాగతం" అంటూ "తరతరాల తెలుగు రుచులు" గ్రంథానికి ముందుమాట, రాశారు ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ.

సాహిత్యపరంగా ఇలా వుండగా, రాష్ట్రంలో ఆయుర్వేద వైద్యుల సంక్షేమంకోసం నేషనల్ మెడికల్ అసోసియేషన్ వ్యవస్థాపనలో ముఖ్యపాత్ర వహించాను. 25 ఏళ్ళుగా లయన్స్ అంతర్జాతీయ సంస్థలో సభ్యుడిగా, లయనిజంపైన ఎనిమిది పుస్తకాలు రాశాను.

తెలుగు విశ్వవిద్యాలయ కీర్తి పురస్కారాలతోపాటు ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం 2002లో భాషాభిజ్ఞ పురస్కారం, 2009లో భాషాపురస్కారం ఇచ్చి గౌరవించాయి. జాషువా, నార్ల వెంకటేశ్వరరావు, కాశీనాథుని నాగేశ్వరరావు, డా॥ద్వా.నా.శాస్త్రి, గిడుగు రామమూర్తి, ఆరుద్ర ప్రభృతుల పేర్లతో అనేక పురస్కారాలు లభించాయి. వందకుపైగా రచనలు వెలువడ్డాయి.

నా సాహిత్య జీవితానికి సృజనాత్మకత – పరిశోధన రెండు ముఖ్యాంశాలు. శాస్త్ర విషయాలు రాసినా, సృజనాత్మకత కలిగిన రచయితని కాబట్టి. అతి సామాన్యుడిక్కూడా అర్థం అయ్యేలా విడమరచి చెప్పే శైలి సాధించగలిగాను.

తెలుగు పాఠకులు నన్నెంతగానో అభిమానించారు. సమకాలీన రచయితలు సమాదరించారు. పరిశోధకులు అక్కున చేర్చుకున్నారు. పెద్దలు ఆశీర్వదించారు. ఇంతమంది సహచరులను పొందగలగడం ఒక అదృష్టం.

అతి చిన్న వయసులోనే కలం పట్టడం వలన 1970 తర్వాత కూడా జీవించిన సాహితీవేత్తల్ని చాలామందిని ప్రత్యక్షంగా నేనెరుగుదును. కొంతమందితో సాన్నిహిత్యాన్ని కూడా పొందగలిగాను. పరిశోధనా రంగంలో నా పూర్వీకుల అడుగులు ఎక్కడ ఆగాయో అక్కడి నుంచి పరిశోధనలు కొనసాగించి, నా తరువాత తరానికి అందించాలనేది నా తపన.

ఏ పుస్తకం ఎంత ఇచ్చిందని అంచనా వేస్తే అసంఖ్యాక పాఠక మిత్రుల్ని సంపాదించి పెట్టిందని మాత్రం చెప్పగలను. రాష్ట్రంలో ఏ వూరెళ్ళినా కనీసం నలుగురైనా నన్నెరిగిన వారుంటారని నా నమ్మకం. అదే ఈ జీవితంలో నా ఆస్తి! తక్కినదంతా నాస్తి!

*(నది (మాసపత్రిక) 2010 అక్టోబర్ సంచికనుండి)*

# పరిపూర్ణ జీవి

## డా॥ జి.వి.పూర్ణచందు

**- డా॥ రాధశ్రీ**

శ్రీకారంబును జుట్టితి
శ్రీ కృష్ణా మండలమున జీవీ పూర్ణుం
డేకతముగ విహరించిన
నాకమునూహించి - వ్రాయ - నవ్య పథమునన్ ॥ 1

"సత్యప్రసూన" ప్రసూనము
సత్యమ్మును తెలుపు పూర్ణచంద్రనిభంబై
స్తుత్యములగు రచనలతో
నిత్యము గొనుచుండు ప్రజల నీరాజనముల్ ॥ 2

ఘనుడగు 'జీవీజీ' కే
తనయుండై 'మెహరుచందు' తత్త్వము నెల్లన్
కనసొంపుగ ననసొంపుగ
వినసొంపుగ చెప్పుచుండు విశ్లేషణతోన్ ॥ 3

అరుణారుణ కిరణములుగ
'వరలక్ష్మీచేతన', 'శివ' వరలుచునుండన్
సిరివెన్నెల గురిపించెడి
వరపుత్రుండగు 'మనోజ్ఞు' వంశము నిలిపెన్ ॥ 4

'సుశ్రుత'తో నస్వస్థుల
శుశ్రూషలలో తరించి - శోభ దలిర్పన్
విశ్రుతులను విస్తృతముగ
నశ్రాంతము వ్యక్తపరచి ఆనందించున్ ॥ 5

'పూర్ణేశ్వరు'నకు మనుమడు
పూర్ణ శ్రీచంద్రుడనగ పూజల గొని - సం
కీర్ణమ్మగు బాధల - సం
పూర్ణమ్ముగ తొలగజేయు - పూనిక తోడన్ ॥ 6

ఆయుర్వేదము జదివియు
పాయక రుచి చూచి పద్యపరమాన్నంబున్
తీయగ నందించంగల
ధీయుతుడై వెలుగు నింద్ర తేజముతోడన్ ॥ 7

కంజదళాక్షుని కృపతో
మంజులమై వెలుగు మేఘమాలను నడుపన్
రంజిల్లె తల్లి శారద
వింజామర తోడ గాలి వీచిన పగిదిన్ ॥ 8

సాహిత్యము వెలయించుచు
సాహిత్యము వెలువరించు సంస్థలకెల్లన్
తాహతును మించు సాయము
బాహాటముగా నొసగుచు ప్రథితుండయ్యెన్ ॥ 9

సంపాదననెంచక - సహ
సంపాదన చేసినాడు - సత్సంపుటులన్
నింపాదిగ చదువుకొనగ
నింపొందవెడి రచన చేసి నిర్భరుడయ్యెన్ ॥ 10

'జీవీజీకే' సుతునిగ
జీవీ శ్రీ పూర్ణచందు శ్రితహితమతియై
సేవించి కనకదుర్గను
దేవీకృపతోడ చెలగి ధీమతియయ్యెన్ ॥ 11

విద్యార్థిగ నున్నప్పుడె
పద్యమ్ము రచించి మిగుల పరవశమొప్పన్
హృద్యమ్ముగ వినుచుచు - నన
వద్యమ్మొనరించినాడు - పద్య హృదయుడై ॥ 12

'అమలిన శృంగారమ్ము'ను
విమలమ్ముగ చెప్పినాడు విజ్ఞత తోడన్
కమలాక్షుడు కరుణ గురియ
శ్రమతో నిలబెట్టినాడు సాహిత్యమ్మున్ ॥ 13

'రాయలనాటి రుచుల' పై
వ్రాయగ - పఠియించినట్టి - ప్రథితాత్ములు జా
తీయ సదస్సున నితనిని
వ్రాయసమున - ననిరి - కృష్ణరాయడటంచున్ ॥ 14

'ఎరుకల జీవిత చిత్రణ'
నెరుగంగల రీతి చెప్ప నీప్సిత గుణులై
జరిపించిరి సన్మిత్రులు
గిరిజన సభ నొక టితనిని కీర్తించుటకై ॥ 15

ఈ రచయితపై శోధన
తీరుగ నొనరించినట్టి ధీరులు వీరిన్
వారిజ నేత్రుని కృపతో
సారస్వతమున నిలిపిరి చక్కని స్థాయిన్ ॥ 16

బంగారు కిరీటమ్ములు
బంగరుతో చేసినట్టి పతకచయంబుల్
సింగారించిరి విజ్ఞులు
బంగరు మనసున్న ఇతనిపై ప్రేముడితోన్ ॥ 17

ఆయుర్వేదపు ప్రగతిని
తీయగ వివరించినట్టి దివ్య సదస్సున్
ధ్యేయముతో నడిపించుచు
శ్రేయోమార్గమును జూపి జేజేల గొనెన్ ॥ 18

శ్రీ 'విశ్వనాథ శబరి' ని -
భావుకుడై చదివి చదివి - ప్రథిత హృదయుడై
పావనముగ విశదపరచి -
కావించెను పాఠకులను కవితాత్ములుగన్ ॥ 19

'వేటూరి' శోధనములను
దీటుగ మనకంద జేసి - తెలియంజెప్పెన్
'వేటూరి' వారి పాటల
మాటున చెలువొందుచున్న మర్మచయంబున్ ॥ 20

లీలగ - కవితా హేలగ
జ్వాలగ - శ్రీ పూర్ణచంద్ర శర్మ వెలుంగన్
మాలగ - భావములల్లుచు
గ్రాలగ - నీతని యశస్సు - వ్రాయుదునిటులన్ ॥ 21

పత్రమ్ములు వ్రాయుచు - పద
చిత్రమ్ములు గీయుచున్న జీవిని పూర్ణున్
మిత్రమ్ముగ భావించుచు
ఛత్రమ్ముగ నొసగుచుంటి సద్భావంబున్ ॥ 22

'జగ్గయ్యపేట సభ' లో
నిగ్గులు చూపించినట్టి నేర్పుదలచుచున్
మొగ్గను జూపించిన ఘను
లగ్గముగా నితని పొగిడి రానందముతోన్ ॥ 23

'కృష్ణాజిల్లా' లో గల
'కృష్ణా విద్యాలయమ్ము' కీర్తింపంగన్
కృష్ణుండగు ఆంధ్రమహా
విష్ణువు దీవించినాడు వేవిధములుగన్ ॥ 24

'ఆంధ్రప్రశస్తి' ని గాంచియు
ఆంధ్రుండై సాహసించి ఆంధ్రత్వముతో
ఆంధ్ర ప్రాశస్తిని నుడువగ
నాంధ్రులు తలలూచినార లభినందనగన్ ॥ 25

'ఈ నేల'లోన - 'నది'లో -
ప్రాణప్రదమైన 'చినుకు' పత్రికలో - వి
జ్ఞానమ్ము నందచేసిన
జ్ఞానిగ నే గొలుతు పూర్ణచందు కవీశున్ ॥ 26

ఒక వైద్యుడొక్క భావుకు
డొక ప్రతిభాశీలి, యొక్క ఉత్సాహియు - నిం
కొక చారిత్రక రచయిత
చకచక కలగలిసి పూర్ణ చంద్రుండయ్యెన్ ॥ 27

ఘనతముడగు షేక్సిపియరు
జనియించిన నాడు పుట్టి - సారస్వత జీ
వన వనమున విహరించెడి
చణుడని భావించి పూర్ణచంద్రుని గొలుతున్ ॥ 28

'ఆత్మలతో మాట్లాడు' పవి
త్రాత్మల వివరించినాడు - తత్వముతో యా
ధ్యాత్మిక భావములు ప్రయో
గాత్మకముగ చెప్పినాడు - కవిచంద్రుండై ॥ 29

పసిమనసులు సంతసపడి
ముసిముసి నవ్వులను రువ్వ పూర్ణాత్ముండై
కుసుమించిన భావములను
నస పెట్టని రీతి చెప్పె నవ్య పథమునన్ ॥ 30

తీరగు నీతని కంఠము
ధారావాహికగ దూరదర్శనులో – 'ఆ
హారమ్మారోగ్యము' గా
ప్రేరణ కలిగించి మిగుల ప్రియమొనరించెన్ ॥ 31

జోరుగ సాగిన సంపుటి
పేరే "ముక్కాలు" గాని – విశ్లేషింపన్
ధారగ మనసును దాకెను
మారని మమతాభిమాన మధురిమతోడన్ ॥

ముక్కాలి పీట నెక్కిన
చక్కని వారణమువోలె సంతసమిడుచున్
మిక్కుటమగు మక్కువతో
చుక్కల చూపించు నీటి చుక్కగ నిలిచెన్ ॥

'కృష్ణాతీర చరిత్ర' ను
కృష్ణమ తొలగించు రీతి కృతనిశ్చయ రో
చిష్ణువుగా నాంధ్రమహా
విష్ణువు వ్రాయంగజేయ విజయుండయ్యెన్ ॥ 32

ఇంపగు రచనములను గని
సొంపగు భావముల నరసి – సుగుణాత్ముండౌ
'కొంపెల్ల' తెలుగు రథమున
నింపుగ కూర్చుండబెట్టె నీ కవివర్యున్ ॥ 33

అరయ – 'నిదీ సంగతి' – యని
వరయుత 'సౌజన్య' వార పత్రికలోనన్
పరివారమెల్ల చదువగ
విరచించిన పూర్ణచందు విజ్ఞత నెంతున్ ॥ 34

'వల్లభుడు' 'రాఘవేంద్రుం'
డెల్లలు దాటించి రితని ఎదలో మెదలే
చల్లని సిద్ధాంతములను
మెల్లగ రాష్ట్రేతరులును మెచ్చెడి రీతిన్ ॥ 35

యువభారతి సన్మానము
నవమార్గములో నితనిని నడిపించుటచే
భవహరుని కరుణ తోడుత
చవులూరింపంగ నిడె ప్రసంగమును ధృతిన్ ॥ 36

కొణిజేటి రోశయాఖ్యుడు –
జనమెరిగిన వైద్యుడనుచు సంస్తుతి జేయన్
జనులందరు పులకించుచు –
మన 'జీవీ' కిడిరి శతనమస్కారంబుల్ ॥ 37

విమలభిషగ్రత్నమ్మని
క్రమమెరిగిన హస్తవాసి కలవాడని - వి
క్రముడనుచు ప్రజలు నుడువగ
నమలాత్ముండనుచు 'చంద్రు' నారాధింతున్ ॥ 38

ఆరోగ్యామృతము నొసగి
ఆరోగ్యపు గీతనొసగి ఆహ్లాదింపన్
ఆరోగ్య రహస్యమ్ముల
నారాధన చేయు 'చంద్రు' నభినందింతున్ ॥ 39

తెలుగే ప్రాచీనమనుచు
వెలుగులు జిలుగులు చిలుకగ విబుధులు మెచ్చన్
అలనాటి పట్టణమ్ముల
నలవోకగ చూపి గలిగె నాంధ్రావనికిన్ ॥ 40

'పద్యానుభవము' శీర్షిక
హృద్యమ్ముగ నడిపెనితడు హృషితాత్ముండై
విద్యాధికు లెల్లపొగడ
విద్యార్థులు వల్లెవేయు విధమును తెలిపెను ॥ 41

'ఆహారోపనిషత్తు'గ
తాహత్తుకు మించనట్టి ధరలకు దొరికే
ఆహారమ్మును జెప్పెను
కాహళి పూరించినట్లు కమనీయముగన్ ॥ 42

విరజాజిపూల పగిదిన
విరచించిన కృతులను విని విన్నాణముతో
వరణీయపురస్కృతినిడి
'కిరణకుమారుండు' మిగుల కీర్తన జేసెన్ ॥ 43

సుధలిడు 'తెలుగు మహాసభ'
ప్రధితోత్తమమైన యట్టి పద్ధతిలోనన్
విధిని విధానమును దెలిపి
గ్రథనమ్మొనరించె 'చందు' క్రమమగు రీతిన్ ॥ 44

'మహిళా విద్యాలయ' మి
మ్మహిలో వెలుగొందు రీతి - మహిళామణులన్
సహనమునకు రూపములని
మహితుండై చెప్పెనితడు మధురిమ వెలయన్ ॥ 45

తలుపులపై ముక్కాలును
తలపగ నా ఎదుట నిలచె - తనకైతానే
వెలుగులతో జిలుగులతో
కులుకులతో స్వాగతించు కోమలి వోలెన్ ॥

ఆకుగ నల్లల్లాడుచు
మేకే ఏకైన పగిది మేన్పులకింపన్
ఈ కవి "ముక్కాలు" తెలిపి
కాకోదరశయనుని దయ కవితగ నిలచెన్ ॥

భాషాభిజ్ఞ పురస్కృతి
భూషణమై చేరినంత - పూజితగుణుడై
భాషాయోషను గొలుచుచు
పాషాణమ్మును మలచెను పసిడితునకగన్ ॥ 46

లయ - నిజమై వెలుగొందగ
'లయ నిజము'ను విశదపరచి వ్రాసిన రచనన్
జయ పథమున చరియించు - వి
జయులందరు పొగడినారు - చక్కనిదనుచున్ ॥ 47

మండలి బుద్ధుని తోడుత
లండనులో పర్యటించి - లాక్షణికంబై
నిండుగ వెలిగెడి తెలుగును
మెండుగ పూజించె 'చందు' మృదులాత్ముండై ॥ 48

కొమరగిరి బుచ్చినాయన -
అమలంబగు కృషినిమెచ్చి - ఆనందముతో
విమల పురస్కారంబును
ప్రమదమ్మున 'చందు' కొసగె - రస హృదయుండై ॥ 49

ఆయుర్వేద ఫిజీష్యను
చేయంగల కార్యములను జేయుచు - నాపై
ధీయుతుడై రచనలపై
పాయని రుచి చూపె 'చందు' ప్రజ్ఞానిధియై ॥ 50

ద్వానాశాస్త్రి పురస్కృతి
శ్రీ నాగేశ్వరు బహుమతి - చిన్మయమొప్పన్
తానా వారి పురస్కృతి
ధీనిధి 'చందు' నకు జెంద తేజము హెచ్చెన్ ॥ 51

మధురమ్మగు భావమ్ముల
నధునాతనమైన రీతి యందించుటకై
'మధులత' ప్రచురణలందున
సుధలను శ్రీ 'చందు' చిలికి సొబగుల నద్దెన్ ॥ 52

సీ నారాయణరెడ్డికి-
ద్వానాశాస్త్రికిని- మిగుల దార్శనికుండౌ
మానిత బుద్ధ ప్రసాదుకు-
జ్ఞానిగ వెలుగొందు 'చందు' సఖుడైనిలిచెన్ ॥ 53

ఆకాశవాణి కేంద్రము
ప్రాకటముగ జరుపుకొనుచు - స్వర్ణోత్సవ -ము
చ్ఛేకముతో బహుమతినిడె
నాకము జూపించినట్టి నవకవి యనుచున్ ॥ 54

తడబాటు లేని రీతిన
జడులకు చేతనము నొసగ - చక్కగ - "నేష్నల్
మెడికలసోస్యేష" నితని
వడిపై విశ్వాసముంచి బహుమతినొసగెన్ ॥ 55

ఇండో యూరోపియనుల
గుండెలలో నున్న తెలుగు కులుకుల నరయన్
నిండయిన సదస్సు జరిపి
మెండుగ శోధించి గొనెను మించిన కీర్తిన్ ॥ 56

ఎగ్జిబిషను సొసయిటి - రస
దృగ్జాలమ్మునకు మెచ్చి - తెలుగు వెలుగుకే
ఎగ్జాంపులైన చందుకు
లగ్జూరియసైన నొక పురస్కారమిడెన్ ॥ 57

"ముక్కాలు" యనెడి ప్రక్రియ
చిక్కని భావముల తోడ సృష్టించంగన్
చక్కగ నది వివరించెను
గ్రక్కున పరిపూర్ణజీవి రసహృదయంబున్ ॥ 58

తియ్యని భావమ్ములతో
నుయ్యాల లూగించు చందు నుత్సాహముతో
ఉయ్యూరు సరసభారతి
నెయ్యము తోడుత బహుమతి నిచ్చె ముదమునన్ ॥ 59

రెక్కీలు నిర్వహించుచు
పక్కాగా ప్లాను జేయు పద్ధతిలోనన్
ముక్కాలు విజయమొందును
చక్కని మన తెలుగు భాష సంతసము గొనన్ ॥

"చెవినిల్లు" కట్టి - పోరక -
చెవితో బాటుగ నొనర్చు జేబును "నిల్లు"న్
అవలీలగ కవి నుడివిన
పవరును ముక్కాలు మనకు "పంచి"గ నిచ్చెన్ ॥

కథ వెనుక కథను జెప్పుచు
సుధలను చిందించి - చందు - సోయగ మొప్పన్
వ్యధలను తొలగించంగల
మధనము చేయించినాడు మాటల తోడన్ ॥ 60

జీవితమున ముదముగలుగ -
జీవితమున శుభము గలుగ - శ్రేయము గలుగన్
సేవించెద భగవానుని -
జీవ శ్రీపూర్ణచందు శేముషి వెలుగన్ ॥ 61

వెలుగుత నూతన ప్రక్రియ
వెలుగుత శ్రీ పూర్ణచందు విఖ్యాతుండై
వెలుగుత "ముక్కాలు" సతము
వెలుగుత సాహిత్యమందు విబుధులు మెచ్చన్ ॥

# పలుకుచున్నది శుభమస్తు తెలుగుతల్లి

- శ్రీ అజ్మీరు వీరభద్రయ్య

1. కం॥ శ్రీకర్త శుభకర్తధీరగు
ణాకర, శ్రీగంగరాజుసువంశమ్
శ్రీకారమైనయశమును
చేకొనుమా పూర్ణచంద్రశ్రేయముగలుగునే!

2. సీ॥ ఉపవేదమైన ఆయుర్వేదవైద్యాన్ని
ప్రజలకందించిన ప్రతిభమేది;
మాతృభాషకు దివ్యమాన్యతచేకూర్చి
శోభిల్లజేసిన స్ఫూర్తి మీది;
ఆవిరళకృషితోడ వివిధ వేదికలపై
తెలుగువెల్గునుజాటు దీక్షమీది;
తెలుగు రచయితల దివ్యనుభూతుల్ని
సంఘటితముజేసి సాహసముగ

తే॥గీ॥ దేశదేశాలలోనున్న తెలుగువారి
నెల్లరనునొక్క టిగజేర్చినేర్పుతోడ
ఆంధ్రభాషామతల్లికి ఆర్తిదీర్చి
ముద్దుబిడ్డవై నిలిచిన పూర్ణచంద్రు।

3. తే॥గీ॥ ఆంధ్రభాషమీపరిశోధనాంశములఁవారి
నవనవోన్మేషమైవెల్లె యవనియందు
పద్యబ్రహ్మోత్సవాలతో పరవశింప
ఆంధ్రభోజుడు చిరుమందహాసుడయ్యె!

4. తే॥గీ॥ అటవదేడులు మీసేవలందుకున్న
తెలుగునేలసర్వస్వమ్ముపులకరించె;
షష్టిపూర్తితో పరిపూర్ణ చరితజూచి
పలుకుచున్నది శుభమస్తు తెలుగుతల్లి!

5. తే॥గీ॥ షష్టిపూర్తినుండిశతవసంతములును
చిరయస్సుల సౌహార్ద్ర శ్రీలతోడ
భగవదాశీస్సులందుచు వైభవముగ
పూర్ణపురుషులైవరలుడు పూర్ణచందు !



నాన్న గారు - అమ్మ
జి.వి.జి.కె. చంద్రమౌళేశ్వరరావు, సత్యప్రసూన



1958 మొదటి పుట్టిన రోజున పూర్ణచందు



1963లో ఉపనయనం బాలభటువు పూర్ణచందు



అమ్మతో  చిన్ననాడు పూర్ణచందు, పెద్ద చెల్లాయి శ్యామల, చిన్న చెల్లాయి శ్రీలక్ష్మి



చిన్న చెల్లాయి శ్రీలక్ష్మి, రఘువరప్రసాద్‌ల
పెళ్ళినాటి ఫొటో



కుమారుడు మనోజ్ఞ కార్తీక్ అక్షరాభ్యాసం
చేయిస్తున్న తాతగారలిద్దరూ



1981లో హౌస్‌సర్జన్‌గా ఉన్నప్పుడు పూర్ణచందు



25-12-1982 పూర్ణచందు, అరుణల వివాహం



పూర్ణచందు వివాహ సందర్భంగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీమతి రామరత్నం



కుమారుడు చి. మనోజ్ఞ కార్తీక్ మొదటి పుట్టినరోజు
(10-2-1988) సందర్భంగా కుమార్తె
చి. లక్ష్మీ చేతనతో పూర్ణచందు, అరుణ



మామగారు గోవిందరాజు దత్తాత్రేయులు,
అత్తగారు పరమేశ్వరమ్మ
కుమార్తె చి. లక్ష్మీచేతన తో 1985లో
పూర్ణచందు, అరుణ



9-08-2001 తన ఆసుపత్రి స్వంత భవనంలోకి గృహప్రవేశం చేస్తూ



1980లో తన తొలి గ్రంథరచన "అమలిన శృంగారం" అమ్మకూ, నాన్నకూ అంకితం ఇస్తున్న పూర్ణచందు. చిత్రంలో శ్రీ బూదరాజు శ్యామసుందర్ ఉన్నారు



1976 పూర్ణచందు మేఘమాల సంచికను ఆవిష్కరిస్తున్న ప్రసిద్ధ నవలా రచయిత, పాత్రికేయుడు "హవిస్"



1976 మేఘమాల లిఖిత మాసపత్రికను ఆవిష్కరిస్తున్న ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ డా ముదిగొండ శంకరశాస్త్రి, శ్రీ నేరెళ్ళ లక్ష్మణరావు.



తమ 35వ పెళ్ళిరోజున పూర్ణచందుతో అరుణ



కుమార్తె వివాహానికి తాంబూలాలు అందిస్తున్న పూర్ణచందు దంపతులు



వియ్యంకుడు శ్రీ చక్కిలం జనార్దనరావు శ్రీమతి ఉషారాణి దంపతులు
కుమార్తె లక్ష్మీచేతన, అల్లుడు మల్లిక్, కుమారుడు డా॥ మనోజ్ఞ కార్తీక్‌లతో పూర్ణచందు, అరుణ
మనుమరాలు చి॥ శ్రీ సాత్విక, మనుమడు చి॥ సమన్యు




1988 పూర్ణచందు కవిత 'కాంతిస్వప్న' ఆవిష్కరిస్తున్న డా. పరుచూరి రాజారామ్,
శ్రీ నండూరి రామ్మోహన్‌రావు, శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ, శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రభృతులు



ఈ టీవీ వారి ఇంటర్వ్యూ



ఇంద్రసభ సాహితీ రూపకంలో ఇంద్రుడి పాత్రలో
పూర్ణచందు



డా. జి వి పూర్ణచందు జీవితము-రచనల మీద ఆంధ్ర
విశ్వవిద్యాలయంలో పి హెచ్ డి పరిశోధన చేసిన
డా. వేమకోటి శాంతారావుతో



జస్టిస్ భవానీ ప్రసాద్. ఆచార్య యార్లగడ్డ, శ్రీ బుద్ధప్రసాద్ పూర్ణచందుని సత్కరించారు.



న్యూ జెర్సీ తెలుగు ప్రముఖుడు, అమెరికన్ రాజకీయవేత్త శ్రీ చివుకుల ఉపేంద్రను సత్కరిస్తున్న శ్రీ బుద్ధప్రసాద్. పూర్ణచందు. శ్రీ గుత్తికొండసుబ్బారావు



విజయవాడ చిల్డ్రన్ స్కూల్స్ వెల్ఫేర్ అసోసియేషన్ వారి వార్షికోత్సవ సభలో ముఖ్యఅతిథిగా పూర్ణచందు




1990లో పూర్ణచందు వెలువరించిన తల్లి వైద్యం గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న డా. కొమ్మూరి వేణుగోపాలరావు



1990 తల్లి వైద్యం గ్రంథాన్ని తన ఆత్మీయ మిత్రులు శ్రీ మైత్రేయ గారికి అంకితం ఇస్తూన్న పూర్ణచందు.



2006లో పూర్ణచందు వెలువరించిన ఆరు గ్రంథాలను ఒకే వేదికపైన ఆవిష్కరించిన సందర్భంగా శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్, శ్రీ బుద్ధప్రసాద్, లయన్స్ గవర్నర్ శ్రీ దేవినేని కిషోర్ కుమార్, శ్రీ లంక వెంకటరమణ, శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్ ప్రభృతులు



1979-80 ఆయుర్వేద కళాశాల మ్యాగజైన్ సుధాస్రవంతికి విద్యార్థి ఎడిటర్‌గా పూర్ణచందు, ఆవిష్కరిస్తున్న ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ కూచిమంచి సత్య సుబ్రహ్మణ్యం, కళాశాల ఆచార్యులు డా. పి వి యె. వెంకటాచార్య



తన "రామాయణంలో విశేషాలు"ను శ్రీ ఎల్. వి. రమణ దంపతులకు అంకితం ఇస్తున్న పూర్ణచందు, అరుణ పూర్ణచందు తండ్రి శ్రీ చంద్రమౌళీశ్వరరావు.



శ్రీ మండలి బుద్ధప్రసాద్ సేవాయానం గ్రంథావిష్కరణ చేస్తున్న శ్రీ తనికెళ్ళభరణి, డా. మండలి బుద్ధప్రసాద్ దంపతులు, జస్టిస్ జి. భవానీప్రసాద్ పూర్ణచందు, శ్రీ ఇమ్మిడిశెట్టి రామకుమార్



తన "కొసమెరుపులు" గ్రంథాన్ని డా. ద్వా. నా. శాస్త్రికి అంకితం ఇస్తున్న పూర్ణచందు. చిత్రంలో శ్రీ కొల్లూరి, శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు, డా. మండలి బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, శ్రీ ఓలేటి, శ్రీ డి చంద్రశేఖర్, దూరదర్శన్ సంచాలకులు శ్రీ పళనిస్వామి




1995లో మీ వ్యాధులకు మీరే వైద్యులు గ్రంథావిష్కరణ సభలో గురువు డా. ఇవటూరి రామకృష్ణ వండర్ వరల్డ్ ఎడిటర్ శ్రీ వట్లూరి నారాయణరావు



1993 తన "సప్తసింధు" ఐతిహాసిక నవలను శ్రీ ముక్కామల నాగభూషణం గారికి అంకితం ఇస్తున్న పూర్ణచందు.



2008 న్యాయమూర్తి, సాహితీవేత్త, శ్రీ బాలకృష్ణారెడ్డి, శ్రీ జాలాది, శ్రీ హనుమారెడ్డి ప్రభృతులచే ప్రకాశం జిల్లా రచయితల సంఘం వారి సత్కారం.



పూర్ణచందు రచన "తరతరాల తెలుగు రుచులు" (ఎమెస్కో ప్రచురణ) ఆవిష్కరిస్తున్న డా. బుద్ధప్రసాద్, శ్రీ మంగళగిరి ఆదిత్య ప్రసాద్, శ్రీ ఎమెస్కో విజయకుమార్, శ్రీ విహారి



తన సాహితీ రజతోత్సవం 2003 సందర్భంగా అమ్మనూ నాన్ననూ సత్కరించిన పూర్ణచందు దంపతులు.
చిత్రంలో ప్రముఖ సాహితీవేత్తలు శ్రీ వట్లూరి నారాయణరావు, శ్రీ పురాణపండ రంగనాథ్, శ్రీ విహారి,
డా. ద్వానా శాస్త్రి, లయన్స్ పూర్వపు గవర్నర్ శ్రీ తాతినేని శ్రీహరిరావు,
ప్రచురణకర్త శ్రీ వి యల్ నరసారెడ్డి, కుమార్తె చి. లక్ష్మీ చేతన, కుమారుడు చి.మనోజ్ఞ కార్తీక్,
శ్రీ కృష్ణాజీ, శ్రీ వల్లీ మనోహర్



తాను గురువుగా భావించే
శ్రీ పురాణపండ రంగనాథ్‌కి తన పరిశోధనాగ్రంథం
"అలనాటి ఆహారాలు" గ్రంథాన్ని అంకితం ఇస్తున్న
డా. పూర్ణచందు, అరుణ



2004లో శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి తన పరిశోధనా గ్రంథం "బ్రిటిష్ యుగం" అంకితం ఇచ్చి సత్కరిస్తున్న పూర్ణచందు. ఆకాశవాణి సంచాలకులు శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్, ప్రచురణకర్త శ్రీ నరసారెడ్డి.



పూర్ణచందు సాహితీ రజతోత్సవం 2003 సందర్భంగా 6 పుస్తకాలను ఆవిష్కరిస్తున్న శ్రీ గోపీనాథ్,
డా. బుద్ధప్రసాద్, డా. ద్వానాశాస్త్రి, శ్రీ తెలకపల్లి రవి, డా. రావెల సాంబశివరావు, శ్రీ విహారి, శ్రీ కృష్ణాజీ
సిద్ధార్థ వాకర్స్ క్లబ్ వారి నిర్వహణలో...



2008 డా. జి వి పూర్ణచందు రచన "నైలూ నుండి కృష్ణ దాకా" ఆవిష్కరణ చేస్తున్న శ్రీ బుద్ధప్రసాద్, కర్నాటక పూర్వపు గవర్నర్ రమాదేవి గారు, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ



వెలుగురాగాలు కవితా సంపుటిని శ్రీమతి చలసాని వసుమతి గారికి అంకితం చేస్తున్న పూర్ణచందు.



తన గురువు శ్రీ విహారి గారికి "ఆయుర్వేదంలో పథ్యాలు-అపథ్యాలు" గ్రంథాన్ని అంకితం ఇచ్చి సత్కరిస్తున్న పూర్ణచందు, అరుణ



స్వాతంత్ర్య సంగ్రామం - కథలు - గాథలు ఆవిష్కరణ. డా. బుద్ధప్రసాద్, జర్మనీలో తెలుగు మేయర్ రవీంద్ర గుజ్జుల, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ ఇమ్మడిశెట్టి రామకుమార్, పూర్ణచందు



విజయవాడ దూరదర్శన్ కేంద్రం వారు ఒక ఇంటర్వ్యూ చిత్రీకరించినప్పుడు



'విశ్వనాథ సాహితీ విశ్వరూపం' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ నారా లోకేష్, డా. పల్లె రఘునాథ్‌రెడ్డి, శ్రీ గొల్లపూడి మారుతీరావు, శ్రీ సుద్దాల అశోక్‌తేజ, డా. బుద్ధ ప్రసాద్ దంపతులు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. పూర్ణచందు



తరతరాల తెలుగు రుచులు గ్రంథాన్ని శ్రీ గుత్తికొండ సుబ్బారావుకు అంకితం ఇస్తున్న పూర్ణచందు



విజయవాడ ప్రెస్ క్లబ్ వారు 2014 పురస్కారాలు పొందిన శ్రీ సిల్వెస్టర్, శ్రీ పెద్దిభొట్ల సుబ్బరామయ్య, శ్రీ సి రాఘవాచారి, శ్రీ తమ్మారెడ్డి శ్రీనివాసరెడ్డి డా. పూర్ణచందులను సత్కరించారు




1983లో హిమలక్ష్మీ బాలవిద్యామందిరం వార్షికోత్సవం సందర్భంగా కవిసమ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారితో పూర్ణచందు



2012 కృష్ణాజిల్లా సాంస్కృతిక మండలి వారిచే ఉగాది ప్రతిభా పురస్కారం అందిస్తున్న జిల్లా అధికారులు.



డా జి వి పూర్ణచందు ప్రతిష్టాత్మక ఆహారశాస్త్ర పరిశోధనాగ్రంథం "ఆహారవేదం" ఆవిష్కరిస్తున్న సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ జాస్తి చలమేశ్వర్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ బుద్ధప్రసాద్, శాసనమండలి సభ్యులు శ్రీ ఐలాపురం వెంకయ్య



కృష్ణాకలెక్టర్ గారిచే మాతృభాషా దినోత్సవ సత్కారం



మిత్రులు వండర్ వరల్డ్ ఎడిటర్ శ్రీ వట్లూరి నారాయణరావు, షుగర్ వ్యాధి నిపుణులు డా. సదాశివరావు, పూర్ణచందు రచన 'దీర్ఘాయుష్మాన్‌భవ' ఆవిష్కరిస్తున్నారు.



పూర్ణచందు కవిత 'వెలుగు రాగాలు' ఆవిష్కరిస్తున్న కృష్ణా విశ్వవిద్యాలయం ఉప కులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్, డా. రావి రంగారావు, డా.వి. నాగరాజ్యలక్ష్మి



1980లలో పూర్ణచందు విస్తృతంగా నిర్వహించిన మినీ కవితా ప్రదర్శనలలో ఇది ఒకటి. గుంటూరు అరసం వారి నిర్వహణ.



1988లో శ్రీ గుత్తికొండ సుబ్బారావుకు తన 'కాంతి స్వప్న' అంకితం ఇస్తున్న పూర్ణచందు.
డా. పరుచూరి రాజారామ్ ఆ సభకు అధ్యక్షత వహించారు.



నేషనల్ మెడికల్ అసోసియేషన్ వారు శ్రీ గోకరాజు గంగరాజు గారి చేతులమీదుగా పూర్ణచందుకు 2009 ఉగాది పురస్కారం అందించారు.



విజయభావన విజయనగరం వారు
డా. పూర్ణచందుని సత్కరించారు.



5-3-2006న ధ్యానమాలిక పత్రిక విశిష్ట సాహితీ పురస్కారాన్ని పూర్ణచందుకు అందిస్తున్న శ్రీ భిక్షమయ్య గురూజీ, సంపాదకులు శ్రీ మెరుగు రాధాకృష్ణమూర్తి



2006 కృష్ణాజిల్లా న్యూమాన్యువల్ కమిటీ పక్షాన లంక వెంకట రమణ, పూర్ణచందు గార్ల సంపాదకత్వంలో వెలువరించిన 'బెజవాడ డివిజన్' గ్రంథాన్ని ఆవిష్కరిస్తున్న కృష్ణా కలెక్టర్ శ్రీ ప్రభాకరరెడ్డి, విజయవాడ కమిషనర్, శ్రీమతి అనురాధ



తెలుగు విశ్వవిద్యాలయ కీర్తి పురస్కారం అందుకున్న సందర్భంగా మచిలీపట్టణంలోని సాహితీ సంస్థల పక్షాన కృష్ణావిశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్, డా. రావి రంగారావు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ యు టి ఎఫ్ వెంకటేశ్వర్లు, శ్రీ కొట్టి రామారావు ప్రభృతులు పూర్ణచందుని సత్కరించారు



ఇంటర్మీడియట్‌లో పాఠాలు చెప్పిన గురువులు డా. జంధ్యాల పరదేశిబాబు, శ్రీ మల్లాది సత్యనారాయణ శాస్త్రిగారు 2003లో రసభారతి సంస్థ పక్షాన తమ శిష్యుడు పూర్ణచందుకు ఉగాది పురస్కారం ఇచ్చి సత్కరించారు.



2011 కొనకళ్ళ వెంకటరత్నం జయంతి సందర్భంగా కొనకళ్ళ విశిష్ట సాహితీ పురస్కారం అందిస్తున్న పశ్చిమ గోదావరి జిల్లా రచయితల సంఘం సభ్యులు



శ్రీ విష్ణుశాయి జ్ఞానజ్యోతి విజయవాడ వారి సర్వధారి ఉగాది (2008) పురస్కారం స్వీకరించి, రామాయణంలో విశేషాలు అంశం పైన పూర్ణచందు ప్రసంగించారు.



పూర్ణచందుకు డా. పట్టాభి కళాపీఠం, గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్టు వారిచే జీవనసాఫల్య పురస్కారం అందిస్తున్న శ్రీ గుత్తికొండ సుబ్బారావు, శ్రీ తూములూరి రాజేంద్రప్రసాద్



ఆంధ్ర ఆర్ట్స్ అకాడెమీ కార్యదర్శి శ్రీ గోళ్ళ నారాయణరావు గారితో పూర్ణచందు



మచిలీపట్టణం హాస్యలహరి సంస్థ పక్షాన భాషా సేవకు గుర్తుగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. పూర్ణచందులను సత్కరించిన డా. ధన్వంతరాచారి, డా. మాదిరాజు రామలింగేశ్వరరావు ప్రభృతులు



పరిశోధనా పరమేశ్వరుడు డా. ఆరుద్ర, సాహితీ తపస్వి పోలవరపు కోటేశ్వరరావు గారల సాహితీ పురస్కారం పూర్ణచందుకు అందిస్తున్న శ్రీ గోళ్ళనారాయణరావు, శ్రీ తెలకపల్లి రవి, శ్రీ మంగళగిరి ఆదిత్యప్రసాద్, డా. గుమ్మా సాంబశివరావు, శ్రీ వాకాటి శిరీష్ కుమార్ ప్రభృతులు



శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి.వి. పూర్ణచందులను కైకలూరు సాహితీమిత్రులు సత్కరించారు.



లండన్ బ్రిటిష్ లైబ్రరీ ప్రాంగణంలో యుక్తా సంస్థవారు పూర్ణచందును సత్కరిస్తున్న దృశ్యం



అనూఫాంట్స్ సృష్టికర్త శ్రీ ప్రసాద్ గారిని సత్కరిస్తున్న డా. బుద్ధప్రసాద్, డా. లక్ష్మీప్రసాద్, డా. పూర్ణచందు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు



2016 ఉగాది కవిసమ్మేళనంలో డా. పూర్ణచందుని సత్కరిస్తున్న సాంస్కృతిక శాఖామాత్యులు డా పల్లె రఘునాథరెడ్డి, డా, విజయభాస్కర్



అమరావతి సాహితీమిత్రులు ప్రతిభా పురస్కారాలసభలో డా.పూర్ణచందును సత్కరిస్తున్న డా. రావి రంగారావు



చెన్నై శ్రీకళాసుధ సాంస్కృతిక సంస్థవారి జాతీయ పురస్కారం, డా. పల్లె రఘునాథ రెడ్డి,
శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీమతి ఇందిరా దత్తు గార్ల చేతులమీదుగా రజత కిరీట ధారణ.
శ్రీ తనికెళ్ల భరణి, శ్రీ ఎమెస్కో విజయకుమార్, శ్రీ గుమ్మడి గోపాలకృష్ణ, శ్రీ భువనచంద్ర, సంస్థ నిర్వాహకులు
శ్రీ శ్రీనివాస్, చిత్రకారుడు శ్రీ ఈశ్వర్, శ్రీ కర్నాటి లక్ష్మీ నరసయ్య, శ్రీ విజ్ఞాన్ రత్తయ్య ఉన్నారు.



విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ పక్షాన
శ్రీ ఎమెస్కో విజయ కుమార్ గారిచే సత్కారం.



మద్రాస్ విశ్వవిద్యాలయం, తెలుగుశాఖ వారి
ఆర్కాట్ ప్రకాశరావు పురస్కారం పొంది ధర్మనిధి
ఉపన్యాసం ఇచ్చిన పూర్ణచందు, ఆచార్య ఆర్ వి
యస్ సుందరం, ఆచార్య మాడభూషి సంపత్
కుమార్, శ్రీ యర్రమిల్లి రామకృష్ణ.



విజయవాడ టెలిఫోన్స్ జనరల్ మేనేజర్
శ్రీ రాధాకృష్ణన్ తన కార్యాలయంలో
డా. పూర్ణచందును సత్కరించారు.




'మన ఆరోగ్యం' పత్రిక సంపాదకులు (
శ్రీ వి యల్ నరసారెడ్డి డా. పూర్ణచందు దంపతులను
సత్కరిస్తున్న దృశ్యం



అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం సందర్భంగా 2017 ఫిబ్రవరి 25న రాష్ట్ర మంత్రులు, డా. పల్లె రఘునాథరెడ్డి, శ్రీ దేవినేని ఉమామహేశ్వరరావు గార్లచే సత్కారం



ప్రొద్దుటూరు వేమన సాహితీ కళాపీఠం వారిచే వేమన విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య అత్తిపల్లి రామచంద్రారెడ్డి చేతులమీదుగా సత్కారం,



పూర్ణచందుని సత్కరించి ఆశీర్వదిస్తున్న ప్రాచార్య శలాక రఘునాథ శర్మ



యువభారతి మరియు స్నేహనికుంజ్ (హైదరాబాద్) వారిచే తెలుగు భాషకు ప్రాచీనతాహోదా సందర్భంగా పూర్ణచందు, గుత్తికొండ సుబ్బారావులను సత్కరిస్తున్న డా. ఎ.బి.కె ప్రసాద్, డా. బుద్ధప్రసాద్, డా. రాళ్ళబండి కవితా ప్రసాద్, డా. కె.బి.లక్ష్మి ప్రభృతులు.



పూర్ణచందును సత్కరిస్తున్న నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి ఆచార్య జి. కృపాచారి



పూర్ణచందును సత్కరిస్తున్న ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ, డా. మండలి బుద్ధప్రసాద్



శిష్యుణ్ణి సత్కరిస్తున్న గురువులు శ్రీ విహారి, శ్రీ గుత్తికొండ సుబ్బారావు



2012 కృష్ణావిశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్ డా. రావి రంగారావు, శ్రీమతి వి నాగరాజ్యలక్ష్మి గార్లచే సత్కారం



2009 ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ, కిన్నెర ఆర్ట్ థియేటర్స్ వారిచే తెలుగు భాషామహోత్సవాల సందర్భంగా డా. పూర్ణచందు, డా సామలరమేష్ బాబు లను సత్కరించారు. ఆచార్య యన్ గోపి, నాటి ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ విజయబాబు ప్రభృతులు



పూర్ణచందు రచన 'తెలుగే ప్రాచీనం' ఆంగ్లంలోకి 'The Antiquity of Telugu' పేరుతో అనువాదాన్ని ఆవిష్కరిస్తున్న డా. బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, అనువాదకులు డా. తుర్లపాటి రాజేశ్వరి.



డా. అద్దేపల్లి రామమోహన రావు, శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, ఆచార్య యండ్లూరి సుధాకర్ ప్రభృతులతో పాటుగా, పూర్ణచందుకు 2000 మిలీనియం కవికోకిల గుఱ్ఱం జాషువా స్మారక విశిష్ట సాహితీ పురస్కారం అందించిన శ్రీ జాలాది



ఆచార్య పర్వతనేని సుబ్బారావు,
డా. రావి రంగారావులచే పూర్ణచందుకు సత్కారం.




విజయవాడ వేటూరి సాహితీ సమితి వారిచే
పూర్ణచందుకు సత్కారం



టెలికాం ఉద్యోగుల సంక్షేమ సంఘం వారిచే
పూర్ణచందుకు సత్కారం.



విజయవాడ సిద్దార్థ కళాశాల వారిచే పూర్ణచందుకు
సత్కారం




వైద్యంలో తన గురువు డా. పరుచూరి రాజారామ్‌ని సత్కరిస్తున్న పూర్ణచందు



పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం తెలుగు భాషా సదస్సులో కీలక ప్రసంగం చేసిన పూర్ణచందు



పూర్ణచందు సత్కరిస్తున్న శ్రీ కొల్లూరి, శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు, శ్రీ ఓలేటి, డా. బుద్ధప్రసాద్ ప్రభృతులు



శ్రీ ప్రమణి గురూజీ పూర్ణచందును ఆశీర్వదించి సత్కరించారు.



శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్‌ని సత్కరిస్తున్న పూర్ణచందు



కుర్తాళం పీఠాధిపతుల సమక్షంలో
డా.పి.ఎ. రామన్‌గారిచే పూర్ణచందుకు సత్కారం



తి.తి.దే. పరివార సాహిత్య ప్రాజెక్ట్ సంచాలకులు
ఆచార్య కె. సర్వోత్తమరావు గారిచే సత్కారం



సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్ వారి సదస్సు (బెంగుళూరు)లో ఆయుర్వేద వైద్య విద్య ఆధునీకరణ పైన ప్రసంగిస్తున్న పూర్ణచందు



జయంతి ప్రచురణ సంస్థల అధినేత శ్రీ ముత్యాల పెరుమాళ్లు పూర్ణచందు, అరుణలను సత్కరించారు.



పంచకర్మ చికిత్సా నిపుణుడిగా పూర్ణచందు



1984-85లలో 'ఆదివారం వారపత్రిక'లో "ఏమిటా రహస్యం?" శీర్షిక నిర్వహించినప్పుడు పాఠకుల నుండి రోజూ వందలాది ఉత్తరాలు వచ్చేవి. ఉత్తరాల పోగులోంచి ఉత్తరాలను పరిశీలిస్తున్న పూర్ణచందు



కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన జస్టిస్ శ్రీకృష్ణ కమిటీకి ఇచ్చిన నివేదికను పత్రికలకు విడుదల చేసిన పూర్ణచందు



ప్రముఖ కవి శ్రీ రసరాజు గారితో పూర్ణచందు



1981లో విజయవాడలో కళ్లకలక వ్యాధి ఉధృతంగా వచ్చినప్పుడు ఎపెక్స్ క్లబ్ పక్షాన డా. పూర్ణచందు ఒక చికిత్సా శిబిరం నిర్వహించారు. సౌజన్య వారపత్రిక మేనేజర్ శ్రీ ఎస్ గజేంద్రరావు సహకరించారు.



చర్మవ్యాధుల నిపుణులు, లయన్స్ జిల్లా గవర్నర్ డా. బి. నరసింహారావుతో కలిసి పూర్ణచందు వందకు పైగా ఉచిత చర్మవ్యాధుల చికిత్సా శిబిరాలు నిర్వహించారు.



లయన్స్ డిస్ట్రిక్ట్ క్యాబినెట్ సెక్రటరీ పూర్ణచందు, లయన్స్ గవర్నర్ శ్రీ టి దుర్గామల్లేశ్వర రావు 2001వ సంవత్సరంలో సంభవించిన వరదల బాధితులకు స్టీలు బిందెలు, నిత్యావసర వస్తువులు అందించారు.



లయన్స్ జిల్లా గవర్నర్ శ్రీ దుర్గామల్లేశ్వరరావుతో కలిసి వరద బాధితులకు సేవలందిస్తున్న పూర్ణచందు



లయన్స్ కార్యక్రమాలకు వ్యాఖ్యాతగా పూర్ణచందు



లయన్స్ అంతర్జాతీయ సంస్థ రీజనల్ కాన్ఫరెన్స్‌లో పూర్ణచందు దంపతులకు పూర్ణకుంభ స్వాగతం



లయన్స్ క్లబ్ అంతర్జాతీయ సంస్థలో 35 యేళ్ళుగా వివిధ హోదాలలో సేవలందించిన డా. పూర్ణచందు ఒక ఉచిత వైద్య శిబిరంలో రోగులను పరిక్షిస్తూ



లయన్స్ అంతర్జాతీయ పురస్కారాన్ని అందిస్తున్న అంతర్జాతీయ డైరెక్టర్ లయన్ చిగురుపాటి వరప్రసాద్, జిల్లా గవర్నర్ శ్రీ గోపీనాథ్



"మెల్విన్ జోన్స్ ఫెలో" అయిన సందర్భంగా లయన్స్ అంతర్జాతీయ డైరెక్టర్ లయన్ చిగురుపాటి వరప్రసాద్, లయన్ శ్రీ టి దుర్గామల్లేశ్వరరావు పూర్ణచందు చాంబర్లో ఎం జె ఎఫ్ ప్లేక్ బహూకరించారు.



1996-97 లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ విద్యాధర సంస్థ ప్రారంభోత్సవంలో జ్యోతి వెలిగిస్తున్న అరుణ



1996 విజయవాడ ప్రథమ మేయర్ టి. వెంకటేశ్వరరావు పూర్ణచందును సత్కరించారు.



తన 'అలనాటి పట్టణాలు' గ్రంథాన్ని లయన్ తన్నీరు శేషగిరిరావు దంపతులకు అంకితం ఇస్తున్న పూర్ణచందు దంపతులు



లయన్స్ పక్షాన కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకున్న వారికి స్టీలు గిన్నెలు అందిస్తున్న పూర్ణచందు.



1976-81 పూర్ణచందుతో కలిసి చదువుకున్న ఆయుర్వేద వైద్య పట్టభద్రులు.



శ్రీ వాసిరెడ్డి నవీన్ ను సత్కరిస్తూ పూర్ణచందు



2003లో పూర్ణచందు సాహిత్య రజతోత్సవాల సందర్భంగా ఆయన వ్రాసిన పుస్తకాల ప్రదర్శనను ప్రారంభించిన శ్రీ మండలి బుద్ధప్రసాద్.



లోక్‌సత్తా నాయకులు శ్రీ జయప్రకాష్ నారాయణ్ గారిని పూర్ణచందు కలిసి తెలుగు భాషాభివృద్ధికి పార్టీ మద్దతు కోరిన సందర్భం



2008 విజయవాడ బుక్ ఫెస్టివల్ సొసైటీ వారు శ్రీ యండమూరి వీరేంద్రనాథ్, డా. జి వి పూర్ణచందులతో ముఖాముఖీ ఏర్పాటు చేశారు.



శ్రీ ఉషశ్రీ, శ్రీ మధురాంతకం రాజారామ్, డా. పూర్ణచందు, శ్రీ కాశీ విశ్వమోహన్ శ్రీమతి ఇంద్రగంటి జానకిబాల 1980లో ఒక సభలో ఇలా కలిశారు.



శ్రీ మల్లెమాల, శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవి, డా. పూర్ణచందు కృష్ణాజిల్లా రచయితల
6వ మహాసభ ప్రారంభిస్తూ...



తంజావూరు తమిళ విశ్వవిద్యాలయంలో
తమిళతల్లి దారువిగ్రహం దగ్గర
పూర్ణచందు



తమిళ విశ్వవిద్యాలయం
వైస్ చాన్సలర్ గారిచే సత్కారం



కృష్ణా డెల్టా రైతాంగ సమస్యలపై డా॥ బుద్ధప్రసాద్
ఆమరణ నిరాహార దీక్ష చేసినప్పుడు వారితో
సంఘీభావంగా పూర్ణచందు



డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు మంజూష
నవలల సంపుటి గ్రంథావిష్కరణ సభకు అధ్యక్షత
వహించిన పూర్ణచందు




భారత సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ జాస్తి చలమేశ్వర్ గారిని సత్కరిస్తూ



తంజావూరు బృహదీశ్వరాలయం సందర్శించిన డా. బుద్ధప్రసాద్, డా. శ్రీపాద సుబ్రహ్మణ్యం, డా. నాగసూరి వేణుగోపాల్, శ్రీ కూచిబొట్ల ఆనంద్, డా॥ పూర్ణచందు, శ్రీ ముద్దు కృష్ణ



తంజావూరు దగ్గర మేలట్టూరులో
నాట్యకళాకారుడు
శ్రీ మహాలింగం గారితో పూర్ణచందు




28-1-2008 The classicalness of Languages: The Dravidiyan Context" అంశంపై ద్రావిడ విశ్వవిద్యాలయం సదస్సులో పరిశోధనాపత్రం సమర్పిస్తున్న పూర్ణచందు



సీనియర్ పాత్రికేయులు సాహిత్యంలో గురువు శ్రీ వీరాజీ గారి ఆత్మీయాలింగనం



ఇద్దరు రాజారామ్ గార్లతో కలిసి దిగిన 1980 నాటి అపురూప చిత్రం ఇది. ఈ ఫోటోలో ఎడమ నుండి శ్రీ అక్కల బాబురావు, ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి, శ్రీ పెనుగొండ లక్ష్మీ నారాయణ, డా. పరుచూరి రాజారామ్, శ్రీ మధురాంతకం రాజారామ్, డా. రావి రంగారావు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి వి పూర్ణచందు, శ్రీ బూదరాజు శ్యామసుందర్, డా. పోతుకూచి వెంకటేశ్వర్లు ఉన్నారు. బందరులో పూర్ణచందు ఏర్పాటు చేసిన మినీకవితా సదస్సు సందర్భంగా ఈ పెద్దలంతా బందరు టౌన్‌హాల్లో ఇలా కలిశారు.



సినీనటుడు శ్రీ ఎల్ బి శ్రీరామ్ గారిని సత్కరిస్తూ



భారత గ్రామీణ అధ్యయనం & పరిశోధన సంస్థ అగ్రశ్రీ, తిరుపతి వారి తెలుగు భాషా సదస్సులో పూర్ణచందు, శ్రీ తుర్లపాటి కుటుంబరావు, శ్రీ గుత్తికొండ సుబ్బారావు



శ్రీ గుత్తికొండ సుబ్బారావు,
ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గార్లతో పూర్ణచందు



పుదుచ్చేరి కంచి మామునివార్ సెంటర్ ఫర్ పి.జి. స్టడీస్ వారు నిర్వహించిన 'Cultural History of Food in South India' జాతీయ సదస్సులో పత్ర సమర్పణ చేస్తున్న పూర్ణచందు.



తెలుగు భాషోద్యమంలో భాగంగా కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాలలో రచయితల పాదయాత్రని ప్రారంభిస్తున్న డా. బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు గార్లతో సమన్వయకర్త శ్రీ పూర్ణచందు



లండన్ బ్రిటిష్ మ్యూజియంలో గుడివాడ బౌద్ధస్తూపంలోని బుద్ధ అస్థికల బరిణల దగ్గర శ్రీ బుద్ధ ప్రసాద్, శ్రీ చక్రపాణి గార్లతో పూర్ణచందు



కేంద్ర వైద్య,ఆరోగ్య శాఖామంత్రి శ్రీ జగత్ ప్రసాద్ నడ్డా గారితో పూర్ణచందు నాయకత్వంలో ఆయుర్వేద వైద్య సంఘాల నాయకులు కలిసి చర్చిస్తున్న దృశ్యం



"నా ఐరోపా యాత్ర" వేమూరి రాజేష్ గ్రంథ ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన పూర్ణచందు. డా. జంధ్యాల శంకర్, డా. బుద్ధప్రసాద్, డా. ప్రసాద్, డా. ఈమని శివనాగిరెడ్డి ఆవిష్కరిస్తున్నారు.



బ్రిటన్ విదేశాంగ శాఖ మంత్రి అలిస్టర్ జేమ్స్ హెండ్రీ బర్ట్, కాటన్ మహాశయుని
మునిమనుమడు రాబర్ట్ కాటన్ దంపతులతో పూర్ణచందు



లండన్ ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభకు పూర్ణచందును
పరిచయం చేస్తున్న ఆచార్య ఈమని శివనాగిరెడ్డి



చరిత్ర పరిశోధకులు డా. డి రాజారెడ్డి, ఆచార్య మురళి, ఆచార్య
కూచిభట్ల కామేశ్వరరావు, ఆచార్య నందూరి శ్రీరామమూర్తి
గార్లతో లండన్ బ్రిటీష్ మ్యూజియంలో పూర్ణచందు



లండన్ బ్రిటీష్ లైబ్రరీ అధికారి కెల్విన్ మెహ్మూట్ తో మన చరిత్ర పరిశోధకులు మరియు
శ్రీ బుద్ధప్రసాద్, పూర్ణచందు



చరిత్ర పరిశోధకులు డా. డి రాజారెడ్డి, ఆచార్య మురళి, ఆచార్య కూచిబొట్ల కామేశ్వరరావు, ఆచార్య నందూరి శ్రీరామమూర్తి ప్రభృతులతో లండన్ టవర్ బ్రిడ్జి వద్ద పూర్ణచందు



లండన్ నగరంలో బ్రౌన్ సమాధి వద్ద నివాళులర్పిస్తూ డా. బుద్ధప్రసాద్, డా. పూర్ణచందు



లండన్ నగరంలో థేమ్స్ నదిపైన డా. బుద్ధ ప్రసాద్, పూర్ణచందు, ఇతర చరిత్ర పరిశోధకులు



సప్తగిరి దూరదర్శన్ వారు 20-07-2016 న కృష్ణాపుష్కర వైభవం 2016 పేరుతో డా. పూర్ణచందు అధ్యక్షతన ఒక కవిసమ్మేళనం నిర్వహించారు. శ్రీ యంపి. జానుకవి,డా. జంధ్యాల మహతీ శంకర్, శ్రీ సి హెచ్ వి బృందావనరావు, శ్రీ యలమర్తి రమణయ్య, శ్రీ పింగళి వెంకట కృష్ణారావు, శ్రీమతి గుడిపూడి రాధికారాణి, డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, శ్రీ శిఖా ఆకాష్, కవి కరీముల్లా , డా. పాపినేని శివశంకర్, శ్రీమతి పుట్టి నాగలక్ష్మి, శ్రీ అజ్మీర్ వీరభద్రయ్య, డా. భూసురపల్లి వెంకటేశ్వర్లు, డా. రావి రంగారావు ఈ కవిసమ్మేళనంలో పాల్గొన్నారు



ప్రముఖ సాహితీవేత్త శ్రీ గూటాల కృష్ణమూర్తి గారితో లండన్‌లో వారి ఇంట్లో పూర్ణచందు, డా. బుద్ధప్రసాద్ ప్రభృతులు




శ్రీ బాలాంత్రపు రజనీకాంతారావు గారి 103వ జన్మదినోత్సవ సందర్భంగా ఆయనను సత్కరిస్తూ డా.పూర్ణచందు, అరుణ, శ్రీమతి మంజులూరి కృష్ణకుమారి



తమిళనాడు రాజపాళ్యంలో రాంకో సిమెంట్స్ అధినేత శ్రీ పి.ఆర్. రామసుబ్రహ్మణ్య రాజాగారితో వారి నివాసంలో డా. బుద్ధప్రసాద్, డా. పూర్ణచందు



సీనియర్ పాత్రికేయులు శ్రీ సిహెచ్.వి.ఎన్.ఎస్. శర్మ గారిని సత్కరిస్తున్న పూర్ణచందు



డా. భూసురపల్లి వెంకటేశ్వర్లును సత్కరిస్తున్న గుత్తికొండ సుబ్బారావు, పూర్ణచందు



తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం ప్రాంగణంలోని మ్యూజియంలో శరభోజి మహరాజు విగ్రహం వద్ద డా. శ్రీ పాద సుబ్రహ్మణ్యం, డా నాగసూరి వేణుగోపాల్ శ్రీ బుద్ధ ప్రసాద్, శ్రీ కూచిభట్ల ఆనంద్ గార్లతో పూర్ణచందు



శ్రీ సత్యానందంని సత్కరిస్తున్న పూర్ణచందు



శ్రీ భువనచంద్ర, డా. దీర్ఘాసి విజయభాస్కర్ గార్లతో పూర్ణచందు



రాజాలక్ష్మీ ఫౌండేషన్ రమణయ్య రాజా గారితో పూర్ణచందు




మద్రాసు విశ్వవిద్యాలయంలో సినీ గేయరచయిత శ్రీ వెన్నెలకంటిని ఆచార్య మాదభూషి సంపత్‌తో కలిసి సత్కరిస్తున్న పూర్ణచందు



ఆచార్య మాదభూషి సంపత్ కుమార్ గారిని సత్కరిస్తున్న పూర్ణచందు



శ్రీ శిఖామణిని సత్కరిస్తున్న పూర్ణచందు




ఆంధ్రకేసరి డిగ్రీ కళాశాల వింశతి ఉత్సవం సందర్భంగా స్వాతంత్ర్య సమర యోధుడు, శ్రీ యాతగిరి నరసింహారావు గారి ఆత్మకథ గ్రంథావిష్కరణ చేస్తున్న శ్రీ ఉండవల్లి అరుణ్ కుమార్, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. పూర్ణచందు ప్రభృతులు



డా. తల్లావఝుల పతంజలి శాస్త్రి గారిని సత్కరిస్తున్న పూర్ణచందు



ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారిని సత్కరిస్తున్న పూర్ణచందు



ప్రముఖ కథారచయిత శ్రీ పెద్దిభట్ల సుబ్బరామయ్య సాహితీ స్ఫూర్తి పురస్కారాన్ని శ్రీ అట్టాడ అప్పలనాయిడుకు అందిస్తున్న సభాధ్యక్షుడు పూర్ణచందు



రచయిత్రి శ్రీమతి జలంధర గారిని సత్కరిస్తున్న ఆంధ్రభూమి వారపత్రిక సంపాదకులు శ్రీమతి ఎ.ఎస్. లక్ష్మి, డా. తుర్లపాటి, డా. పూర్ణచందు



డా. రాధశ్రీని సత్కరిస్తున్న పూర్ణచందు



డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాదుని సత్కరిస్తున్న పూర్ణచందు

